శ్రీ రఘురామచంద్రమూర్త్యైనమః

# శ్రీ శృంగార విచిత్ర

# శ్రీకృష్ణరాయబారము.

(అను ఏకాంక నాటకము.)

కొద్దితరగతుల విద్యార్థులకును, కేవల నవీనులకును
ప్రదర్శన కుపయుక్తంబగునటుల

సత్తెనపల్లి తాలూకా ఫిరంగిపుర వాస్తవ్యులగు
బ్ర॥ మూలుపూరు రామలింగేశ్వరరావు
గారిచే రచియింపబడి

సత్తెనపల్లి తాలూకా పసిదెము పురవాస్తవ్యులగు
మ॥రా॥శ్రీ కొల్ల బుచ్చయ్యశ్రేష్ఠిగారికి
కృతియొసగబడెను.

మొదటికూర్పు 1000.

గుంటూరు ఆర్యవైశ్య ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.

1927.

 [వెల రు 1-0-0.

శ్రీ రఘురామచంద్రమూర్తయే నమః.

# విజ్ఞప్తి.

విద్యాధిపులారా,

ఏనీపొత్తమును లిఖించు యుద్దేశ్యము చింతరయశోవిశాలత కభిలషించి కాదు. నాజీవితమును బ్రప్రథమ్మునుండియు నచ్చటచ్చట శారదానిలయమ్ములలో పనిచేయుటలో మాత్రమే యుపయోగపర్చుచున్న నారాబడిచే స్థిరచరస్థితుల నార్జింపకున్నను వినయవిధేయ కాశిష్యవత్సలుల మాత్రము కొందరి నార్జించితి. అందులకు వ్వారల యొక్కయు మద్హితాగ్రేసరులలో కొందరియొక్కయు యభిప్రాయ ప్రోత్సాహములను నుదినంది బాలభారతీ కళానిధుల బ్రదర్శనమున కించుకంతవలను పరభాషా భారతమ్మునకు ప్రకాశించు "శ్రీకృష్ణ రాయబారి" మ్మను కథావిధానమును "శ్రీశృంగార విచిత్ర కృష్ణ రాయబారి" మ్మనుపేర యతిస్వల్పమ్మగు నేకాంక నాటకముగా యింతకుమున్న దశవర్షమ్ముల క్రిందటనే సులభశైలిలో లిపి యొనర్చితి. అప్పటికే చరిత్రయే యీశైలికి జ్యేష్ఠత్వము వహించెననుట కెంతేనియు సందియమ్ము లేదు. గాని ముద్రణకాలమునకు మాత్ర మియ్యది పుస్తకత్రియమ్ముగా ప్రకాశించునటు చెలియవచ్చెడిని. ఆర్యులారా ప్రస్తుత యుగచర్యను బట్టి కేవలవిద్వాంసులై పుస్తకరచనకు పాల్పడుదానికంటె వేరొక్కడు తదితరులే యట్టియుత్సాహబాధితులై వర్తింతురను విషయమ్ము తరులనడుగక నే స్వాభిప్రాయమ్మునకు బోధనాశక్తి యలరారెడిని. అంతేగాన నేనట్టిపామరాళికల్ల తలకట్టైనన ప్పినను నా మనోతుష్టి నీరీతి వెల్లడింపనెంచి శ్రీరామచంద్రమూర్తి పాదైకధ్యాన పరాయణుండనై ఆదిమకవులవినుతించి యుద్దేశించ కల్పించి సత్తెనపల్లి తాలూకా పణిదెముపురవాస్తవ్యులగు మ॥ రా॥ శ్రీ॥ కొల్ల బుచ్చయ్య శ్రేష్ఠిగారిపేర కృతియొనర్చితి. గాన యీవిధేయునెంతయు నీసడించక నాదలి తప్పొప్పుల సవరణకై పలుదెరగుల ప్రార్థించువాడ.

ఇట్లు విధేయుడు,

మూలుపూరు రామలింగేశ్వరరావు,

గ్రంథకర్త.

ఓమ్.

ఆర్యా!

తమచే రచియింపఁబడిన శ్రీకృష్ణరాయబారమను నేకాంక నాటకమును నచ్చటచ్చటఁ జూచుట తటస్థించినది. చూచినంతవఱకు గద్య, పద్యములు హృద్యములై కడుంగడు సంతసంబును గూర్చినయవి. శైలిధారాళముగ నున్నయది యను నది నాయభిప్రాయము.

సత్తెనపల్లి,
ప్రభవ చైత్ర బ ౭ లు
శనివారము.

ఇట్లు తమవిధేయుడు,
వావిలాల గోపాలకృష్ణయ్య,
విద్యార్థి సంపాదకుడు.

శ్రీపీఠేశ కేంద్రాయనమః.

ఉ॥ దానవవైరి శౌరిచరితంబుగతాఖిలమోక్షహర్మ్యసో
పానముగా రచించితివి భక్తినిబద్ధతమూలు పూరిసం
తానసముద్రచంద్రప్రము దంబు జనింప మనంబునం గనే
మానుగ రాయబారము సమగ్రము జూచితి నేను గాంచనే॥

కం॥ శ్రీకృష్ణరాయబారము
ప్రాకృతగుణదోషహారము పరమార్థమహా
నీకృతి మను తారార్యము
సుకృతియై రామలింగసూరిజనార్యా!

సత్తెనపల్లి,
25–4–1927.

ఇట్లు బుధజనవిధేయుడు,
పు ల హా రి పీ రో జి బా బు.

శ్రీగురుభ్యోన్నమః.

# పంచరత్నములు.

సీ॥ అబ్జకంధర శ్రీహ్రా దబ్జసారంగమై
యబ్జముఖీ దాల్పుహాంసాబ్జనేత్ర

శ్రీరస్తు - శుభమస్తు - అవిఘ్నమస్తు.

# కృతిపతి వంశానుక్రమణిక.

గీ॥ శ్రీకరంబగు కొండవీ । టి సీమయందు
దనరు గుంటూరుమండల । మ్మున బ్రతీతి
గనిన సత్తెనపల్లియ । ను ఘనపురంబొ
కండు వెల్గుచునుండు వి । ఖ్యాతమగుచు॥

గీ॥ ఆనగరమున కీశాన్య । మందు బసిడె
మనగ నొప్పారు పూర్వార్య । మెనసియుండు
నల్ల వైకుంఠమునకన్న । నలఘుదేవ
లోకమున కన్న మిన్నయై । ప్రాకటగతి॥

ఉ॥ ఆపురి నాల్గువర్ణముల । యందసమానయశోప్రపూర్ణులు
దీపిత వైశ్యులాఘనుల । ధీయుతు దారులు కొల్లవంశ్యులా
ప్రాపిత సద్గుణోన్నతుల । రాణవహించెను బాలయార్యుడా
వ్యాపిత సద్యశస్కుడగు । నాళినుతింప నెవాఁడు శక్తుఁడా॥

గీ॥ అట్టి యాఘనముఖుఁ డా । గమ్మయనెడి
తరుణి జేపట్టి భగవంతు । కరుణ వేఁక
య గురవయ సీతయలలక్ష్మ । యాఖ్యలనాగ
యాఖ్యులను సుతులుగాగాంచె । బ్రాముదమున॥

గీ॥ మరియు నచ్చమ్మ గురవమ్మ । నరసమయను
పుత్రికలగని యష్టవి । భూతియుక్తు
డీయనఘుడీయనకుసాటి । యీయనయె య
టంచు సత్పండితులు నుతి । యించమించె॥

ఉ॥ వారల లక్ష్మయాఖ్యుడురు । భాసురరూపుడు శాయమాంబికన్
సూరిజనోక్త మార్గమున । సుందరిగాగొని కొండయాఖ్యునిన్

ధీరుని సుబ్బరాయుని సు । ధీజనవంద్యుని బుచ్చయాఖ్యునిన్
వీరుని నాగయాభిదుని । వేంకటసామిని గోటయాఖ్యునిన్ ॥

కం॥ ఘను గృష్ణయ్యను బాల
య్యను మహాలక్ష్మమయనంత । మాంబలపేర్లన్
దనరెడి సుతలనుగని యిం
ద్రునిమించిన దశనుదుర్ల । దూఁగుచునుండెన్ ॥

ఉ॥ వీరల సుబ్బరాయుడను । విస్తృత ధీరుడు ధీరలోకమం
దారుడు పిన్నతండ్రియగు । నాగయపాలకసూనుడై మహా
దారుడనంగ గ్రాలుచు వి । ధాయకరీతిని మాతృనాజ్ఞ వి
స్తారముగా మెలంగుచు బ । దంపడి పేగును గాంచుచుండెదాన్ ॥

గీ॥ తదితరుల బుచ్చయపతివ్ర । తామణియన
దనరి వెల్లడి యక్కమ్మ । గొనిపసతిగ
గాంచె వీరాంజనేయుని । ఘననిదాను
డై యలరు సీతారామాంజ । నేయు బుల్లి
యాంజనేయుల । మూర్తిత్ర । యమ్మనంగ ॥

వ॥ ఇంకను సమ్మహాత్ముండు.

సీ॥ చేయించుచున్నాడు । శ్రీయాంజనేయాల
యమ్ముశిథిలమాట । నద్దిబాగు
చేయించినాడు శ్రీ । సీతాపతికి వెండి
మకరతోరణము స । మ్యక్సుభక్తి
చేయించ నున్నాడు । శ్రీజనకాత్మజా
రామప్రతిష్ఠల । నీమమెంచి
ఆర్జించినాడు లే । దనకనిచ్చునటన్న
యశమన్నుజులతో గ । లసిమెలగుచు

ఎల్లవారలు, సత్తైన ఽ పల్లిపురికి
నీమహిత చరిత్రమువలన ఽ నే ప్రతీతి
యింతగా వచ్చెననజరి ఽ యీదినాకు
అవనినీ ఘనుసాటియా ఽ కెవడు లేడు ॥

సీ॥ ధనము నార్జించుచో ఽ మనుజునివినయుని
వాదించువారికి ఽ వైరియితడు
భగవంతుడన నరు ఽ డుగిదాయటంచను
పాషండజనులకు ఽ వైరియితడు
ధర్మశాస్త్రముల ఽ బద్ధములని పెగవాగు
కొంటిమానవులకు ఽ వైరియితడు
గురుశిష్యవర్తనల్ ఽ మరచి వదించెడి
క్రూరబాలిశులకు ఽ వైరియితడు

గాక నీఘనునకు శత్రు ఽ లోకమున్న
దంచు దివిటీలఁబట్టి ఽ శోధించి కనిన
కేవలమజాతశత్రుడై ఽ కీర్తిఁగాంచు
ధర నిజన్మయటన్న నా ఽ తరమె జన్మ॥

సీ॥ కోటీశ్వరుండైన ఽ చాటించబోవడు
హరిభక్తుడన్న దా ఽ నలరుచుండు
తుచ్ఛసుఖమ్ముల ఽ తో దృష్టిగాంచడు
గ్రంథకాలక్షేప ఽ కలనమెచ్చు
నాహార శయ్యావి ఽ హారాదులొప్పడు
నిరతిశయానంద ఽ నిరతిజను
నిత్యసంపదలతో ఽ నెగడనుంకించడు
మహితమోక్షవిచార ఽ మగ్నుడగును

దబ్బరపనులకుబ్బి ద – బ్బిబ్బుగవడు
స్వీయలాభమ్మునకు విఱ్ఱ – వీగిపడడు
పరులసంపాదనకసూయ – పడికినియడు
ఘనుడు బుచ్చయ్యబుద్ధి జ – గత్ప్రసిద్ధి॥

సీ॥ ధర్మమేవిజయమ్మ – ధర్మమే యపజయ
మ్మని నాగయార్యుడు – ఘనతదెల్ప
హరిభజనమ్మె ని – శ్చమ్మితరమ్మశా
శ్వతమని వేంకట – స్వామియలర
అతిథిపూజయె పర – మార్థదాయకమని
కోటయాభిఖ్యుడె – క్కుమగదవర
స్వామికార్యమ్మవ – శ్యముజేయదగునని
సరసుడు కృష్ణయ్య – సంతసింప
వేదవిదులగౌర – వించుటయుక్త యశో
వ్యాప్తియేయని బాల – య కడుమెచ్చ
బుచ్చయార్యునకేంగోటు – పొసగు ననుజు
లనిన బహుగుణిశోపాటి – యనుజులొక్కా
సూరి జనమాననీయులు – శుభచరితులు
పృథుల వృజినవిదూరుల – య్యొనగుగాక॥



## ఈ నాటకమందలివచ్చు పురుషులు.

| | |
|---|---|
| ధర్మరాజు<br>భీముడు<br>అర్జునుడు<br>నకులుడు<br>సహదేవుడు | పంచపాండవులు. |

అభిమన్యుడు

కృష్ణుడు— కథానాయకుడు.

| | |
|---|---|
| సేవకుడు. | శకుని |
| విదురుడు. | భీష్ముడు. |
| ధృతరాష్ట్రుడు. | ద్రోణుడు. |
| దుర్యోధనుడు. | కృపుడు. |
| దుశ్శాసనుడు. | అశ్వత్థామ. |
| కర్ణుడు. | |

## స్త్రీలు.

| | |
|---|---|
| ద్రౌపది. | భానుమతి. |
| గాంధారి. | కుంతి. |

శ్రీరస్తు.

# "ఆశీస్సు"

(సూత్రధారుడు ప్రవేశించి.)



శ్రీమద్వ్యాసవకన్యక
వామిథున కులాన్వవాయు కై మహితవిధేయున్
బ్రామోదకలితు బుచ్చయ
నాముం సిరిసంతతుల న కైనయ మోముగృపన్.

వ॥ (అని చదివి తెరవంక చూచి) (స్వగతము) ఏమిది? మదీయ భార్యాలలామ యగు "నటి" ఇంతవరకును సభ నలంకరించ కున్న యది. కారణ మేమై యుండునో! ఏమైయుండును. పురుషుల కంటె నువిదలు ముచ్చట లనినను కలహము లనినను, గృహకృత్యములనే మరచి యుప్విష్ట్యారు చుందురను కింవదంతి శాస్త్రవిహిత మయ్యే యుండును. నాయనుజ్ఞ నెన్నడేని యాయతివ జవదాటి యెఱుగదు. మదీయాజ్ఞానుసరణముగా సభకు వచ్చుచునే యుండు. ఇంతలో నేకల హాగాధయో, యేముచ్చటయో చెవినిబడి యుండు. అందుచే గొంత యాలస్యమై యుండనోపు! ఐనను ఒక్కమారు పిలచి చూచెదను గాక (ప్రకాశము) నటీ, మదనధనుర్భ్రుకుటీ!

(నటీ ప్రవేశము.)

1వ కీర్తన.

నటి:— వ॥ చిత్తము నాథా! కార్యాచరణమునకు జనెద. సెలవును గటాక్షించుము.

సూ:— వ॥ చాలు, చాలు. ఇంకను సెలవులు కటాక్షించుటలు! వీటితోనే కాలయాపనము జేయక నరుగుము.

నటి:— వ॥ చిత్తము. (అని పదియడుగులు ముందుకు నడచి) ఆర్య పుత్రా! ఒక్కమనవి.

సూ:— వ॥ (స్వ) మరలనేదియో తలపెట్టుకొనినది. (ప్ర) కానిమ్ము ఏమది.

నటి:— వ॥ మహాత్మా కోపింపక నిక్కార్యమునకు తామును యించుక తోడ్పడ ప్రార్థితులు.

సూ:— వ॥ సతీ! యీసభాస్థలినిఁ గల పలువిధవిద్వాంసులఁ గన నించుక ధైర్యమొందినటు నీముఖప్రకాశ మ్మెఱుంగ జేసె డిని. అయిన నింతకే చాలాకాలం బతిక్రమించినటు దోచె డిని. గాన వేవేఁగ నుపక్రమింతము. (యుభయులును చేరి) మహాశయులారా!

2వ కీర్తన.

ఈనాటకశాలయందు శ్రీశృంగార విచిత్రకృష్ణరాయబారమ్మను సంగీత యేకాంకనాటకమును ప్రదర్శింపబోయెడిని గాన తామెల్లరు మనోనిశ్చయులై యాకర్ణించ ప్రార్థించువాడను.

(అని యుభయులు నిష్క్రమింతురు)

ఇ ది ప్ర స్తా వ న.



శ్రీరఘురామచంద్రమూర్త్యైనమః.

శ్రీ శృంగార విచిత్ర

# శ్రీ కృష్ణ రాయబారము.



## ప్రథమరంగము.

---

ఉపప్లావ్యమున పంచపాండవులు ద్రుపదపుత్రీసమేతంబుగా గూర్చొని యుండువేళ ధర్మరాజు తమ్ములఁగని

ధర్మ:— వ॥ తమ్ములారా! ద్యూతలాభంబగు పదమూఁడేడులు మృగంబులఁబోలి మహాదరణ్యప్రాప్తులఁ జరించినను మనయస్మక్కుణింకను శిరంబులనే తాండవమాడుననుట కెంతేనియు సందియమ్ము లేదుగదా. ఆదురదృష్టదేవతయే మనలను వీడిన నాదుర్మదాంధుఁడు సంజయునిమూలమున వర్తమానించిన మదభిప్రాయమ్మునకేల సమ్మతింపకుండు. ఇక మనల రాజ్యమేలించినను యరణ్యముల పాలొనర్చినను నప్పార్థసారథి దక్క నెరులెవ్వ రోపుదురు? కాన నవ్వాని భజనమే సర్వవిఘ్ననాశనమై యెల్లకార్యానుకూలమై వర్తించుగాన వేవేగ నతులనే యుపక్రమింతము.

(తెరలో) సత్యసంధులారా! వెరువకుడు వెరువకుడు.

గీ॥ పాండుసుతులార మద్భుహిః ౯ ప్రాణులార
కష్టసుఖములు మనుజుల ౯ కర్మగతిని
వచ్చు దీనికి చింతించ ౯ వలవ దికను
కొద్దిలో హస్తిపురినేలు ౯ కొందు రయ్య

ధర్మ:- వ॥ సోదరులారా మనమెట సంచరించుచుండినను నాద్వారకీ వాసుం డొకకంట మనకష్టచయముల నెల్ల గాంచుచునే యుండునని యిప్పుడుగదా దృఢీకృతమయ్యె. అయిన నప్పద మూడేదులం గూడినది మన పూర్వజన్మ కర్మమునగాన దానిని మరల్చుట కియ్యకొనకుండె గాని లేకున్న మనకర ణ్యాజ్ఞాతవాసంబులు విధించి నపుడే యక్కురుకులంబు నెల్ల నొక్కరెప్పపాటున ధ్వంసంబొనర్పకున్నే. కానమన మెల్లర మేకీభవించి యారమాధవు సన్నిధానమున కేగుట యే కర్తవ్యంబు.

(అని యెల్లగు నిష్క్రమింతురు.)

1వ కీర్తన (అడవులలోపల) పాడుచు ద్వారకకు వెళ్ళుదురు.

---

# ద్వితీయ రంగము.

---

ద్వా ర కా పు రి లో

(శ్రీ కృష్ణుండు భృత్యసహితముగా గూర్చుండి)

కృ:-వ॥ సేవకా! నేడేమొ నామనం బంతయు నప్పాండుకుమారులను జూడగోరెడిని గాన నవ్వారల సందర్శింప నుపప్లావ్యంబుగ్ జేరవలయు. వేవేగ రథగ్ బాయత్త పరచుము. హా!

నాయనుంగు మరందులారా! యేనొకవ్వడైన మిమ్ము బాసియెటుంగుదునో.

ఉ॥ బావమరందులార! యెడ బాయని యట్టి సుధీరులార! మీ
రావిధి కాననమ్ములకు నర్గెడు వేళను దాపునుండి మీ
బావమరంది నయ్యు నెడ బాపగలేని మదీయశక్తి కే
నీవిధి నెల్ల వేళలను హెచ్చగు ఖేదము నొంద నైతిగా

వ॥ హా నాప్రియమరందులారా కళేబరంబులు వేరైనను మన మ్మొకటిగా ప్రవర్తించు మనకిట్టి వియోగంబు సంఘటించునని కలనైన దలంచియుండను గదా! శుభస్కరముగా పురమ్ము జేరిన వెను కనైనను నొక్కమారువచ్చి నామనోతుష్టి నొనర్పక మీకష్టకాల మ్మున నేను తోడ్పడ లేదను నీర్ష్యచే వర్తించుచుంటిరేమొ ధర్మరాజా నామనమ్మును నీవైన దెలిసికొని తమ్ములతో వచించి యెల్లరును జేరి నొక్కమారుగా నిటకరుదేర గూడదా.

(అను నంతలో ధర్మరాజాదులు ద్రౌపది సమేతమ్ముగా కృష్ణ సందర్శ నార్థమై ద్వారకకు వచ్చుచు (శివ కీర్తన చదువవలెను)

(వారిని గని ద్వారకుడు)

ద్వా:— వ॥ లక్ష్మీధవా! వందనము.

కృ:— వ॥ సేవకా యేమేమి.

ద్వా:— వ॥ దేవా! తమయభిప్రాయానుసరణముగనే పాండుకుమారులు ద్రుపదపుత్రీ సమేతమ్ముగా విచ్చేయు చున్నవారలు.

కృ:— వ॥ ఆహా అంతభాగ్యమా (అనియెదురేగి వారలనెల్ల గౌగలిం చుకొని కన్నుల నశ్రువులొల్క నెల్లర నుచితాసనా సీను లంగావించి)

ధ:— వ॥ బావా వందనములు.

కృ:— వ॥ ఆయుష్మాన్భవ (4వది డైలాగ్)

ధ:— వ॥ బావా

గీ॥ అంతమహనీయుగర్భము । దవతరించి
యాలుపిల్లలతో సర । ణ్యమ్ములందు
నన్నమో యంచు నల్లాడి । నట్టిమేము
మరల పదుగురు గనుచుండ । తిరుగ గలమె

వ॥ అట్టి మహనీయగుణగరిష్ఠుండగు పాండునృపునందనులమై లోకమ్ములకెల్ల బూజ్యులమై తారాశశాంకు లుండునంతకున్ దీరని యపవాదుచే ప్రాణమ్ముల గోల్పడనుండు మాకష్టమ్ములను గురించి

గీ॥ తలతురే యెన్నడైన మా । ధవ ధరిత్రి
మమ్ము గూడిన కష్టముల్ । నెమ్మనమున
వచ్చితిమి జచ్చి మిముగాంచు । వాంఛచేత
గాని లేకున్న మోములు । గలవె రాగ

కృ:— వ॥ ధర్మరాజా! యింతకంటె నెక్కుడు దీనత్వమ్మున గృశించువారు లేరా ఏల విచారింతువు.

గీ॥ ఉండుటంతియె యీడ మా । యసువులెల్ల
నెపుడు మిము జేరి యుంటనే । యేండ్లు పదియు
మూడు గడచెడు దన్కనే । మనుధరిత్రి
నన్న మంటిమె యప్పుడో । యనఘులార.

ధ:— వ॥ బావా యింకను మావిషయమ్మున దామట్టి దయారసభావమ్మున వర్తించుకతమ్మున నే యిప్పటికైనను క్షేమస్థితిలో మీసందర్శనానుకూలుర మైతిమి.

(అని తలలువంచుకొని చింతిలు పాండుపుత్రుల కొంతవడికి రెప్పార్పక జూచి తానును చింతతో)

కృ:— వ॥ ఆహా! ఇట్టిసత్యసంధుల కెట్టి దుర్ఘటన సంభవించె.

సీ॥ ధర్మజా యీఘోరకాం । తారమందేరీతి
గడపితో తొల్లి సౌ । ఖ్యమ్ములకును
భీమసేనా నీదు । బిరుదులన్నియు వీడి
యెటుల గష్టాంబోధి । నీదితయ్య
జంట బాయకనునా । జతనుండు ఫల్గుణా
యెటులోర్చితయ్య నీ । వింతకాల
మతిపిన్నలౌ మాద్రి । సుతులార మీరెటు
వర్తించినారో యా । వనములందు
సౌఖ్యముల వీడి నీవు పాం । చాలతనయ
వనము లందెటు నుండితో । మనమునందు
మిమ్ము నాదరి నోచనా । మేనువడకు
ఝల్లుఝల్లని గుండెలు । తల్లడిల్లు

వ॥ ఆహా! సత్యసంధత్వమున త్రిలోకముల నఖండయశమ్ముం గొను సుశీలులారా! మీజననీజనకులకే నొనర్చినవాగ్దానముగీతిచే చరింప సమకట్టినను కష్టములనెల్ల కనులారగాంచి సరివారిలో నతిదీనత్వమున నొప్పుమీదుఃఖమున కేనును చింతింప వలసివచ్చెగదా.

ధ:— వ॥ బావా యూరడిల్లు మూరడిల్లుము. త్రిలోకమ్ముల నుదరమ్మున నుంచుకొనిన మహనీయుడవగు నీవే కన్నిగొల్కిన నిక మాకు దిక్కెవరు? రాజ్యములేకున్నను ప్రాణములతోనైన నరణ్యమ్ముల మృగమ్ముల పోల్కి వేళకుజిక్కిన దానిని భక్షింపుచు వర్తించి యప్పుడప్పుడైనను నిర్భయమ్ముగా భవద్దర్శనమ్ముం గొను లాగున నానతీయ ప్రార్థితులు.

కృ:— వ॥ ధర్మరాజా ఎల్లెట్లు అరణ్యమ్ములఁ మృగమ్ములపోల్కి వర్తింతురా యేల?

గీ॥ అర్ధరాజ్యాధికారులై యుడవులందు
కాలవశమున నుంటిరా కాంక్షలింక
తీరనేలేద?

ధర్మ:— మాధవా తీరనేని
జేరుచోటేది తెల్పుల క్ష్మీనివాస.

కృ:— ధర్మరాజా నృపమార్గమ్ముఁ వీడి యింతదీనత్వమ్ముగా భాషింప కారణంబరయ దలచెద.

ధ:— వ॥ బావా కారణంబేమున్నది?యాదుర్యోధనుండు యుద్ధముజేసి పాలునందవలెనేగాని నటుగాక సూదిమోపినంతస్థలంబు నేని యివ్వంబడదని వచించినట్లును వినియున్నాడ. యదార్థము నీవేమయిన గుర్తెరుంగుదువేమో యని యారుదెంచి నారము.

కృ:— పాండవాగ్రజా! యవ్వాడింత దుర్మార్గమునకుఁ దలయొగ్గెనా.

ధ:— వ॥ అయ్యది మీనుండియే బయల్పడవలెను.

కృ:— వ॥ యుధిష్టరా! అట్లైన వేవేగ కరిపురముఁ జేరి నిజవర్తమానం బరసెద.

ధ:— వ॥ రమావరా, అట్లైన నాసుయోధనమహారాజుగారితో నా వచనమ్ములుగా నిట్లు వెల్లడింపుము.

సీ॥ మామతో గూడి ధర్మవ్యాప్తివీడి జూ
దంబాడినట్టి సత్కర్ముఁడెవడొ
ధనకాంక్షచే తపోధనవృత్తి నున్నమా
సిరిదొంగిలినన్నృపసింహమెవడొ

పినతండ్రి సుతులను | బ్రేమ లేశము లేక
గానసంబులకంపు | ఘనుడెవండొ
పతిభక్తి నొప్పు ద్రౌ | పదిని భంగముజేయ
బాల్పడినట్టి స | ద్బంధుడెవడొ
అట్టి పెదతండ్రిసూను డ | త్యంతరాజ్య
లోభమున వెల్గునట్టి దు | ర్యోధనునకు
దమ్ములన్ గూడి యిటకుమీ | ధర్మరాజు
జేరెనని దెల్పుమయ్య ల | క్ష్మీకళత్ర

వ॥ బావా, యింకను మదీయవాక్కులుగా నిట్లు విన్నవింపుడు

కృ:— వ॥ ధర్మరాజా యేమని

ధ:— వ॥ ఏమనియా, బావా

సీ॥ జూదమాడిననాటి | శూరత్వములుమాని
కరుణపాండవులను | గాంచుమనుము
అష్టకష్టమ్ముల | నంది యీనాటికి
క్షేమమ్ముగాపురి | జేరిరనుము
అర్ధరాజ్యమ్మున | కధికారులౌటమ్ము
చింతింపజేయుట | జెల్లదనుము
తొలుదొల్తనుండి వి | ధ్యుక్తరీతినిమిమ్ము
పెనుగారవమ్మున | బెంచెననుము
పదియు మూడేండ్లు గడిచెనీ | వరకుననుము
బలము లేమియు లేని రా | క్కులజులనుము
మామకార్థము గొనుటదు | ర్మార్గమనుము
వచ్చునపకీర్తి రణమున | వలవదనుము

ధ:— వ॥ యశోదానందనా! యిట్టివామావిపద్దశకెల్ల మాధర్మజుని సహన గుణంబే కారణంబై యొప్పెడిని. లేకున్న నర్ధరాజ్యాధిపతు

లమగు పాండునృపనందనులమై తాఘటించు మాయాజూద
మ్మున సర్వమ్ము గోల్పడినను విధింపబడు నాజ్ఞరీతి పద
మూడేడులం గడపి వచ్చినపై మేమేవ్వర మైదుపురమ్ముల
కధిపతులమౌటయు వద్దురాత్మునకయిష్టమై యుండవలెనా
ఓరీ? దుర్మదాంధా! యొకటటి దుర్మార్గమునకు తలయొగ్గి
తివిరా.

ఉ॥ పాండుకుమారులేవ్వరని ॥ పాలు గ్రహింపగ నుంటివేమె దో
ర్దండుడు నీసహోదర ॥ తంబును నెల్లరు జూడగ నీ తలల్
ఖండనఁజేసి హస్తిపుర ॥ రాజ్యగమున్ వరియించకున్న భీ
ముండిక భీముడే కనర ॥ మూర్ఖ! నృపాధమ! మత్ప్రతిజ్ఞనున్.

కృ:— వ॥ భీమా, శాంతింపుము శాంతింపుము! యిప్పుడీ దురాలాప
మ్ముల నేమిగానున్నయది.

భీ:— వ॥ బావా, వానిదుర్మార్గం బెన్న నంతులేని క్రోధం బుప్పతిల్లెడిని
అయిన నద్దురాత్మునితో నావచన ప్రభావమ్ములుగా
నీట్లు వెల్లడింపుము.

కృ:— వ॥ వాయుపుత్రా, యేమని

భీ:— వ॥ ఏమనియా

ఉ॥ ధర్మము దప్పడేని తన ॥ తండ్రికి నింహాసనంపు శాఖు స
త్కర్ముడు ధర్మరాజునకు ॥ దక్కసగంబును బంచబోలు వే
మర్మము వీడి వెల్వడది ॥ మాటలకియ్యదె వానివాంటిపై
చర్మమువీసు ధమన్నృప ॥ సత్తము నేత నటించు ధారుణిన్.

అర్జు:— వ॥ నందతనయా, నానుడువులుగా నీట్లు వక్కాణింపుము.

ఉ॥ ఉండెను కాల్బలమ్ములిట ॥ నుండిరి ద్రోణుడు భీష్మ కర్ణులున్
భండనమాచరించి సగ ॥ భాగమెటుల్ గొనుజూతమంచు దా
నుండునో యేమొ చెల్లునిక ॥ నుర్విని పాండవు లేవ్వరెల్ల రా

అభి:- వ॥ మామా నాపల్కులుగా నిట్లతనికి దెల్పుడు.

కృ:- వ॥ అభిమన్యూ, బాల్యావస్థ నొప్పు నీవేటిసందేశమ్ము బుత్తెంచ దలంతువు.

అభి:- వ॥ ఏమనియా

ఉ॥ పాండునృపాలపుత్రులిక ♦ భండనభూమికి జొచ్చనేల నే
నుండియు ద్రోణకర్ణులను ♦ నొంచి సుయోధను తమ్ములందరిన్
గుండెలు జీల్చి వానిసుత ♦ కోటినణంచక యున్న పార్థసూ
నుడని దెల్పుమీ తెలుగు ♦ నుగ్ యలవానికి వేగ మాతులా

వ॥ ఈకురుకులనాశమ్మునకై నింతయత్నింపవలెనా? నేనేమైన పూతిగా నొక్కనిముసమ్మున్ బట్టను.

కృ:- వ॥ చెల్లీ, పాంచాలీ!నీరలెల్ల యున్నివిధమ్ములుగా భాషింపుచుండ నీవేల దుఃఖాననవై శిరమ్మువంచుకొనియెదవు.నీపతులెన్నటికైన కౌరవేయులగొట్టి హస్తినాపురపాలనాధికారము సంపాదింతురో లేదో యనుమనోచింత నిన్నిమానససముద్రములో ముంచెనా యేమి?

ద్రౌ:- వ॥ నేనెట్లులున్న మీకేమిలోటు.

కృ:- వ॥ చెల్లీ, యేలనిట్టి నిష్ఠురోక్తులాడెదవు.

ద్రౌ:- వ॥ నానిష్ఠురోక్తులు నిన్నేమిబాధించెను? కానినిజము లోకవిరోధముగదా! అంతర్యమెట్లులున్నను పైకిమాత్రమీరీతి సంభాషించిన గడుపునిండిన దనుకొంటివో.

కృ:- వ॥ చెల్లీ! నీవిషయమున నెన్నడైన బాహ్యాంతరభేదమ్ముచే మెలంగితినే

ద్రౌ:- వ॥ మెలంగితివో లేదో యీపద్యార్థమున నీకేబోధపడగలదు.

కృ:- వ॥ ఏమది.

ద్రౌ:— ఉ॥ ఎల్లరరణ్యవాసమున కేగెడువేళను నేసుమంతికై
యల్లన జేరి ధర్మనృపు నాజ్ఞభవత్పురికిన్ ముదమ్మునై
చల్లగ గొంచబోయితివొ జాలగనయ్యది చెల్లిగాక నీ
చెల్లెలు చెల్లెలే నిజము జెప్పు రమాధవ దాచ కెంతయున్

కృ:— వ॥ తల్లీ నీకేమి తరుగుజేసితి. నీవాదిశక్తిస్వరూపురాలవనియు, నీవు లేకున్న పాండుకుమారులకు జయము వాటిల్లుట దుస్తరంబనియు నేనెఱింగిన దాన హెచ్చరికయే మానితినిగాని నీయందలిదయా విహీనతచే ననుకొంటివో.

ద్రౌ:— ఔనౌను. తామునాయందిట్టి దయారసభావమ్మున వర్తించుకతమ్ముననే నన్నియగౌరవములు జెందినను తుదకీమొండికట్టె ప్రాణమ్ములతోనైనను నిల్చియుండె.

కృ:— వ॥ చెల్లీ, నిన్ను జెందిన యగౌరవమ్ము లేముండె.

ద్రౌ:— వ॥ అవియు నానోటనే పల్కించదలచి గాబోలు నిట్లనుచున్నవాడవు. అయిన ననుభవించినవి వచించుటకు చిన్నతన మేముండును. తెలియనివాని పోల్కి నిపటమానసుండవై వినుటకు నీవుసాసిద్ధపడినై యుండ నాకు శంకయేల. ఇదిగో వినుము.

ఉ॥ నాసరివారు నవ్వ నృప నాధసుతుల్ తలలెత్తిజూడ నా
శ్వాసనదుండగమ్ములక సాధ్యులు నాపతులేవు రుండియున్
జేసిన దెంతయో తమరు జేసినదంతియ గాక వాని నా
గ్రోషము మాన్పగల్గితివె రోసము గల్గిన నాడవైనచోన్.

చ॥ వరసతి యాసుభద్రకిల వంటి యగౌరవ మబ్బెనేని యో
మురహర, నీవుగాని నృపసముఖ్యులు పాండుకుమారులేని యీ
సరణిని యూరకుందురె జాలగ నానివధింప కెంతయున్
పరుల కకారణంపు కృపగాపాల్పడినే చుముబోట్లపై వెసన్.

కృ:— వ॥ తల్లీ, నీవు వెడలనాడక యే నాటిపరాభవదుఃఖము మమ్మెన్ని
రీతుల బాధించినదో యూహించుకొను మదియే యింకను యీ కొలుపుగోలు ప్రవేశంబని ల్పెట్టు
వఘు జనించుట మాకిష్టంబై యూరకొంటి మనుకొంటివో
కాదుకాదు. అప్పటి మన గ్రహచారరీతిచేవారు సాగ్ని నెల్ల
జల్లార్చుకొనియుండవలసివచ్చె. అట్టివారి దుర్మార్గమెల్లయు
కడబట్టి చిరుతకాలములోనే కాబోవు కురువంశక్షయమును
నీవును నేత్రానందకరమ్ముగా జూడగలదానవు కానకోపం
బుడిగి యీనా రాయబారవిషయములో నీయభిప్రాయమే
మొసగెదవో చెల్పుము.

ద్రౌ:— వ॥ సోదరా, అట్లైనయీనా శాపవచనమ్ము లధమాత్మునికి
జేర్పుము.

కృ:— వ॥ ఏమని తల్లీ

ద్రౌ:— వ॥ సోదరా ఏమనియా

ఉ॥ ఏసతి వేశినంటి వడి కె నెంతయునీడ్వగ దమ్మునాపెనో
యేసతినిర్ణి మదమ్మునను కే పేశనచే తొడ పైకిబిల్చెనో
యేసతి వస్త్రరాజి సభ కె నెల్లరుజూడ విశల్చబంచెనో
యాసతి భర్త వాని పొగ కె రంత యడంచు నటంచు దెల్పుడీ

కృ:— వ॥ ధర్మరాజా, యిక నేనతిత్వరితంబ యధమాత్ముని యభిప్రాయ
మ్ము గుర్తెరుంగ గరిపురమ్ముం జేరుదు. నేనటనుండి వచ్చు
వరకు మీరెల్లరు నుపప్లావ్యమ్మునకుం జేరి నారాక
గోరుచుండుడు. (అనికృష్ణుండు హస్తినాపురంబున కరుగు
టలో విదురునింట విందుగొని పిదప ధృతరాష్ట్రునితో
పాండుకుమారుల భాగమునుగురించి కొంతవడికి భాషించి
దుర్యోధనుని కోర్టుకు వెళ్ళును)

---



శ్రీరఘురామచంద్రమూర్త్యైనమః.

## శ్రీ శృంగార విచిత్ర

# శ్రీకృష్ణరాయబారము.

## తృతీయరంగము.

---

—— దుర్యోధన కొల్వు ——

---

(దుర్యోధనాదులుగల సభకు కృష్ణుండువచ్చిన నెల్లరులేచి ముకుళితహస్తులై)

దు:— వ కృష్ణా, వందనము.

కృ:— వ॥ సుఖీభవ, దుర్యోధనా! నీభ్రాతృ, పుత్ర, కళత్రామాత్య, మిత్ర, భృత్యవర్గంబెల్లరకు క్షేమంబేగదా

దు:— వ॥ బావా, తమ కృపోన్నతిని యెల్లరమింతవరకు శుభస్కరస్సుగానే యుంటిమి. స్తోదగీధచా?

ఉ॥ ఎంతటికాలమయ్యె తమ । రిమ్మెడ నోగిరముం గ్రహించి శ్రీ
కాంత భవత్స్వరూపమును । గాంచగ నెల్లరమొక్క రీతిగం
చింతనజేయు మమ్ము దరి । జేర్పగనేటికి యొప్పనేమొ య
త్యంతకృపాప్రపూర్ణమతి । నందుము దీనులమయ్య మాధవా॥

వ॥ బావా, మాయందు కృపారసభావం బలాదకున్నను జాత్యంధత్వమున నే గాక జరాభారమ్ముచే సహా శ్రమపడుచు సర్వదా మీస్వరూపమ్మునే బొడగాంచ రేబవలొక్క రీతి ధ్యానించు మీ మామకైన నెలకొకమాటు దర్శన మబ్బ జేయుటకును సమయం బల వడకుండెనుగదా! రమాధవా, ప్రపంచాధికారులౌ తామింతటి దయా విహీనత్వమ్మున జరింపం జెల్లునే
కృ:— వ॥ ఔనౌను, నిశ్చయమే.

ఉ॥ చక్కగ మూడులోకముల । జాడగలంచెడు కార్యకర్తనే
నొక్కడనైన నిష్ఠురము । లొప్పనటంచని యింతకైన నే
నిక్కడికేగుదెంచి మిము । నెల్లరగంటిని యిందరున్న మీ
కెక్కడ దీరదయ్యె భళి । యొంతయు దెల్పుమి కౌరవేశ్వరా॥

వ॥ లోకత్రయమ్ములంగల్గు మంచిసెబ్బరల పరీక్షింప నేనొక్కండనని తెలిసియు నన్నిటులాడనగునే! వచ్చినను రాకున్నను మీ రెల్ల సర్వదా నామనంబున కంటినవారు గనుక నే యిప్పటికైన రానయ్యె. నేనొక్కడనైనను నిష్ఠురోక్తి తప్పకపోయెనుగాని తామిందరున్నను నేల రాకపోకలు తటస్థింపవయ్యెనో! సుయోధనా మొదటిలోపము లే లోపములుగాని మీలోపములు లోపములా?

దు:— వ॥ బావా

ఉ॥ పెంచెడి వాడవీవెగద పేర్మిని జీవుల కన్నపానము
ల్పెంచెడి వాడ వీవెగద పెక్కగు దుర్మదులన్ ధరాస్థలిన్
ద్రుంచెడి వాడవీవెగద ధీనుత గోపకుమార నిన్ను నే
వంచన జేయజాలు నృప వర్యుడనే కన రాధికాప్రియా॥

వ॥ సచరాచర జంతుకోటినెల్ల పోషించు మహానుభావుండవైన నిను వంచజాలిన మాత్రపువాడనే. బాంధవ్యవశమ్మునన్ వచించిన పల్కులకు క్షమించుక కోపంబందినటు గాన్పించెడిని. కాన క్షమింపప్రార్థితులు.

కృ:- గీ॥ కౌరవేశ్వరులార వి ఖ్యాతులార
భావమరుదు లటంచని బల్కినట్టి
వాక్యముల కెల్లరిటుల క ల్వరము జెంది
యమిత దీనత్వముగ బల్క నగునె మీకు॥

వ॥ మామకుమారులారా, మిమ్మెల్లరిని బాంధవ్యవశమ్మున వచించిన పల్కులకే యింతదీనత్వము జెందవలెనా? మనలో మనకాక్షేపణలున్నవా? లేకున్నను పరిహాసమైనను ధర్మశాస్త్రానుమతమై యొప్పునే నృపధర్మంబని పెద్దలు వచింతురు.

కౌ:- వ॥ ఔనౌను రుక్మిణీధవా

ఉ॥ ధర్మమువీడి పల్కుటయె ధారుణిలో నపకీర్తిహానికిన్
ధర్మము వీడిపల్కుటయె తద్దయు గష్టకృతమ్ము గణించుటల్
ధర్మము వీడిపల్కుటయె దైవవిరోధము నాదునన్ బలే
ధర్మమె యెల్లవారికిని దంపడ సౌఖ్యమటంచు దోచెడిన్॥

కానబావా ధర్మమునెల్లరును ప్రాముఖ్యముగా శిరసావహించవలసిన వస్తుచయములకెల్ల బ్రప్రథమమ్మనియే నాతలంపు.

కృ:- వ॥ సుయోధనా, యిపుడీవు వచించినది నామనమ్మునకెంతయో యానందమ్ము గలుగజేసినయది. అయినను ప్రపంచ

మ్మున మనుజులు ధర్మమెఱింగినరీతి నెన్నియో శ్రుతులను
వచింతురుగాని యాచరణమాత్రము శూన్యంబని చెప్ప
నొప్పు.

దు:— వ॥ బావా యాచరణ లేకేమి?

గీ॥ నలహరిశ్చంద్రులిర్వురా ౹ నాడువారి
నాశ్రయించిన కష్టము ౹ లందుధర్మ
వృత్తి నేవీడ సౌఖ్యసం ౹ ప్రాప్తితుదకు
నందనేర్తురె కనగ ము ౹ కుంద వేడ్క॥

కృ:— వ॥ ఆహా, యీనీసంభాషణ నామనమ్మునెంతయు తృప్తిపరిచె
ఔనౌను, వారందుననే యెంతటికష్టములనైన భరించి తుద
కత్యంతసౌఖ్యంబందిరి. అయినను ధర్మమెఱింగి వచించు
గతి నాచరింపనివారు లేరా యిదిగో వినుము;

గీ॥ వాలిరావణులిర్వు ర ౹ వ్వారిదుర్మ
దమ్ములకు ధాత్రినెల్లము ౹ దమ్ముదూలి
తుదకు బాణాహతినిజాన ౹ తుచ్ఛులిదియు
ధర్మ మిది యధర్మంబను ౹ మర్మమెల్ల
నెఱుగకుందురె బల్క న ౹ రేంద్ర వేడ్క॥

కాన నెవ్వరిని నిందించుటేల? మనముగూడ నెట్టియధర్మము
లాచరించుచుంటిమో గుర్తించజాలముకాని యితరుల దుండగములు
మనకెరుకపడురీతి మనదుండగములును నితరులకే బోధపడవలెను.

దు:— వ॥ బావా, తామవతారపురుషులైనందున తమయందెట్టి యధ
ర్మములును వర్తింపవనియే నాతలంపు. ఇకనేను మను
ష్యమాత్రుండనైనను నిదివరకు చరించిన యధర్మప్రవర్త
నలు లేవనియే నాయభిమతము. ఉండినయెడ బావా, మన
లో మనమింత శంకగానెంచుకొనవలెనా? ఏవిధ్యైన నున్న

యెడల వచించుడు. తత్క్షణంబవ్వాటిఁ వీడి ధర్మకార్యా
నువర్తనుండనై పరమ్మార్గాంచెద. ఇదియు మీభాగ్యమై
యేప్రకాశించునుగదా.

కృ:— వ॥ సుయోధనా, నిజముబల్కవ నిష్ఠురంబన్నట్లు నేనాడబోవు
ధర్మనిరూఢవాక్యములకు నీకాగ్రహం బొదవకున్న.

దు:— వ॥ కృష్ణా, ఒదవినను నాయధర్మమేమో యెఱుంగం బల్కరే
తీరవలెను. నాకాగ్రహమ్మొజనించిన నీమడిమాన్యముల
కేమిలోటగు.

కృ:—వ॥ అటులైన, సుయోధనా, వినుము.

ఉ॥ పాండవులన్న నీకు నడ కే బాయనిబాధులు తొల్లినుండి భూ
మండలి నెల్ల నేలి మిమ్ము కే మాన్యతతోడుత బెద్దజేసియే
యుండిన నెల్ల నిర్వరకు కే నొప్పగజాలిన వారినిట్టులు
ద్దండతరోగ్రభావమున కే దల్పకనూడుట నీకు న్యాయమే॥

దు:— వ॥ కృష్ణా, వారిని సర్వదాదలంప నావలె మనుష్యమాత్రులే
గాని లోకారాధ్యులో! యింతమాత్రముననే నేనధర్మ
వృత్తి నాచరించిన వాడనైతినా.

కృ:— వ॥ సుయోధనా, ఆగ్రహించకుము. (శివ కీర్తన శైలాగ్.)

దు:— గీ॥ చెల్లినిచ్చిన యట్టి నీ కే చెల్మిచేత
బల్కువచనమ్ములకును కో కే పమ్మురాదా
ధర్మమిదేదా యేదా య కే ధర్మమిష్టి
దెల్పవలయు జనులకిక కే దెలియునటుల॥

కృ:— వ॥ సుయోధనా, తొలుదొల్త కోపమే జనింపదన్న నీకు పాం
డవులని పేరెత్తినంత మాత్రముననే నాకును కొన్నిలోప
ముల నిరూపించితివిగదా.

దు:— వ॥ నిజమాడిన నీకేకష్టముగా దోచిన నేమియొటుంగని నన్ను ధర్మవర్తనుండనిన గోసంబుదయింపదో!మనయిర్వురమున్న నీసభాస్థలికెల్ల దూష్యంబనం దోచు నన్యాయమేదేని నా యందొప్పిన వేవేగవచింపుము.

కృ:— వ॥ బావా, సుయోధనా యింకను మనస్సునకురాలేదా ఇదిగో

సీ॥ నీమూలముననగదా ✱ నిఖలరాజ్యముఁవీడి
కాననంబులలోన ✱ గ్రాలవలసె
నీమూలముననగదా ✱ నిత్యాన్నదాన సం
కలనమ్మునకుఁగించ ✱ గలుగవలసె
నీమూలముననగదా ✱ యీమహాసభలోన
బడరానిదీనతల్ ✱ పడగవలసె
నీమూలముననగదా ✱ కోమలరూపముల్
విడిమాఱురూపుల ✱ నడువవలసె
గీ॥ కాంతవస్త్రాపహరణ నీ ✱ కరుణగాదె
కలిమిఁబాయుట నీదుభా ✱ గ్యమునగాదె
ఎన్నిఁజేసిన నీకృప ✱ నెటులొ తుదకు
బ్రతికి పురిజేరనైరి య ✱ ప్పాండుసుతులు॥

దు:— వ॥ అయినచో కృష్ణా.

గీ॥ జేరసారమ్ము జేసెడి ✱ వారలెల్ల
డబ్బునకు గాద యయ్యది ✱ యబ్బురమ్మ
యట్టులే గెల్వ ద్యూతమ్ము ✱ నాడెనతడు
జయముగాంచిన విడునెరా ✱ జ్యమ్ము మరల॥

ప్రపంచమున ధనమును గణించువారలకెవ్వారి కేదియిష్ట మద్దానిననుసరించి ధనమునుగడించుకొనుట ప్రపంచధర్మమేగదా! అ వ్విధిరాష్ట్రంబెల్ల గణించుకొనగోరియేగదా తొలుదొల్త నాతం[illegible]

యిలు జేరిరిగదా! ఇంకను వారిభాగమ్మిచ్చుటకు శంక యేల.

దు:— వ॥ శంక యేలనా, పదమూడేసులు గడచినదాననే

కృ:— వ॥ దాననేమి

దు:— వ॥ దాన నెటులొసంగ బడవలెనో యటులనే యొసంగంబడు.

కృ:— వ॥ బావా, దుర్యోధనా

(6వ కీర్తన, జైలాగ్)

కృ:— వ॥ సుయోధనా మీయుభయులకేదో యొక తెఱంగున సంధి జేసి బాంధవ్యలతాభివృద్ధిని గనన్ గోరు నాయాత్మ నమ్మెల్ల నేటికోకడబ్బెట్టె. గాన సుయోధనా! నామాటను పాటింపవు గదా.

దు:— వ॥ కృష్ణా, నీవు పక్షపాతివై వచించు ధర్మనిరూఢ వాక్యములెటు నాలించువారెవరు.

కృ:— వ॥ నేను పక్షపాతముగా వచించితినా.

దు:— వ॥ ముమ్మాటికి నిను పక్షపాతి వనుటకు సందియంబా.

కృ:— వ॥ అట్లైన నాయాంతర్యం బాలింపుము.

దు:— వ॥ కృష్ణా, యింకేమి భాషించెదు.

కృ:— వ॥ ఏమియా

ఉ॥ వారలు మీరు నాకు నిజ ఁ వైఖరిజూచిన మామపుత్రులా
కారణమంది వేగనిను ఁ గాంచగ జేసితి సత్యమెల్ల నా
కోరిన భాతిభాగమిడ ఁ గూడనిచో రణరంగఘాతగా
ధారికుమార తథ్యమని ఁ నమ్ముము వేగన సందియమ్ముగన్॥

దు:— వ॥ రణరంగఘాతయా? యిటుగాజుల దొడిగించుకొనినవారెవరు కృష్ణా, శాతకంటే ముదుసలులుందురా.

కృ:— వ॥ ఓరిభ్రష్టా, అప్పుడే యుద్ధమునకు కాలుద్రవ్వుచుంటివిగా యీగతి నిష్కారణవైరంబూని పాండవులనడవుల పాలొనర్చ నిచ్చగించితో గాదేని.

ఉ॥ ఆడిన మాటకై సభ నదరుగాంచ త్రయోదశాబ్దముల్
గూడిన మీద యుద్ధమున గూర్పక భాగము సంగనంచు నీ
యేమిపు తొల్లినుండి సుఖ మీ చెడువారల రొసుకగ్లతో
జూపభరించలేవు విడు చుఱగను నిన్నిక ప్రాణమానముల్॥

వ॥ ఓరీ, నీకు స్వర్గము నికగుపడునా? నీవుతొలుదొల్త పాండవుల కరణ్యాజ్ఞాతవాసములు విధించునపుడే పదమూడేడులు గడుపుకొని యిలుజేరినపై యుద్ధముజేసి పాలునందవలెనేగాని లేకున్న నీయంబడదని వచించితివా; నీకు మొదటినుండియు నదటికల్మికి భరించఁజాలని పెద్దరోగమేగదా.

కృ:— గీ॥ ఏను పెవ్వారిదో నీవ యెరుగవలయు
పదియు మూడేండ్లు గడచిన పైనవారి
శాధ్యతలు పోయె నీయంగ బడదటంచు
సంజయుని తోడ బల్కనీ చర్చలేల॥

వారి యేవురకయిదుపురమ్ములనిడ గోరమని బుత్తెంచిన సంజయునకు వారియంటుసొంటు లేక మాస్వాధీనభుక్తానుభవమున వర్తించు స్థిరచరస్థితులలో నయిదుగురకయిదుపురమ్ములే గాక నయిదు పెత్తలస్థలమ్మును నీయంబడదని యిదివరకే జెప్పియుండ తిరిగి యేమో పెత్తనము వహించి ధర్మాధర్మవిచారణకర్తయగు భగవంతునిపోల్కి వారితరపున నీవరుదెంచుట పదుగురకధర్మమో నేనీయననుట యధర్మమో వచింపుము.

కృ:— వ॥ ఓరీ అహంకారప్రమత్తా! యీయంబడదుగదా.

దు:— వ॥ ఓరీ, యాదవకులపాంసనా, యిట్టిమహాసభలో మాకురుకుల గౌరవంబుగ్రహింపక నోటికి వచ్చినట్లాడబోకుము నీగౌరవమ్మునకు నీవుచెప్పువాడవు మేమిచ్చువారమా చాలు చాలు.

ఉ॥ ఇచ్చిన నిచ్చువారమటు ♦ లీయనిచో రణరంగభూమికిన్
జొచ్చిన జొచ్చువారమిది ♦ సుస్థిరమీవును వారుగూడియున్
వచ్చిన బోరువారమిటు ♦ వంట్రిప్రగల్భము లేల లేచిపో
వచ్చును జెప్పనచ్చునల ♦ వారికి వేగ యశోదనందనా॥

వ॥ ఓరీకృష్ణా ఏమునీకన్నులకెంత హీనులముగా నగుపడుచుంటిమి. ఓరీపాండవపక్షపాతీ! నీవుగాక నీరేడుజగమ్ములప్పాండవులకు దోడ్పడినను నీవనిన రణరంగమ్మున జయప్రదమ్మున్గావక వాడిగల సూదిమోపినంత తలంబీయంపడదు. ఇకమీయత్నమ్ములంబో యుద్ధసన్నిద్ధులగుటయే కర్తవ్యమ్ము నీతెలివితేటలకును నీకులగౌరవమ్మునకును నీసత్యవ్రతమ్మునకును నీమనోనిశ్చయమ్మునకును నమ్మున్ దెగనాడు వాడవో! కౌరవ్యుయున్న బలాబలమ్ములను జూచుకొందమురమ్ము నీవనిన కూటికి లేనియప్పాండవులు గొప్పన్ జూతురేగాక మరెవ్వరు జూతురు? మగటిమిగల మగవాడవో యుద్ధమున కెదుర్కొనుము. లేదో వేవేగనిచ్చోటువాయుము దుశ్శాసన కర్ణాశ్వత్థామకృపాచార్యులారా యిపుడీగొల్లం డాడినవచనమ్ములను వినుచుంటిరిగదా (అనుచునొక్క పార్థుడు విరాట్పురిలో నిందరినిబరిమార్చిన సంగతిన్దలంచి యస్థైర్యమొందును.)

దుశ్శా:—వ॥ అగ్రజా

ఉ॥ ఒక్కడొకొక్క శూరునిల ♦ నొంచినకీర్తి వహించు వారికిం
కెక్కువ శక్తియుండునెడ ♦ నింకనొకొక్కడు వేయుమంది నే

నుకట్టణగించు నేము యిట నుండినసైన్యము నెల్ల గుళ్ళు వా
రెక్కడనుండి వచ్చెదరి హీయలవారికి కొమ్ములున్నవో॥

వ॥ నిన్న మొన్నటి వరకీచుట్టుపట్ల భిక్షాటనా కాలక్షేపమ్మున తనుపోషణలొనర్చుకొనిన యమ్ముఖప్రకాశమ్ముల్ గుర్తెరుంగమీ వారంతధీరులేయైన నెల్లరు జూచుచుండ ద్రౌపదికి వస్త్రములవిడల్చు వేళనయిన వారివారిశూరత్వముల వెల్లడింపకుండురే.

కర్ణు:— వ॥ అహో! సుయోధన నృపాలచంద్రమా

ఉ॥ పాండుకుమారు లేవురకు బల్మియతండగుగాక వారలే
గుండెలతోడ యుద్ధమున కుర్జునుదెంతువు వీనినోంచిరా
ముండల పోల్కి వారు మును ముందె యరణ్యముజేర బోదురో
క్కండును నుండబోడు వడి గానికబట్టుడి గృష్ణునెంతయున్॥

వ॥ నిన్న మొన్నటివర కన్న మోయని యలవరించి యాకలమ్మచే ప్రాణరక్షణనొనర్చుకొని జావుందప్పి పురంబున్ జేరిన య ప్పాండవులకిపుడు యుద్ధంబేకోరత. ఈయాదవాధముండే వారలకూతం బౌనటు గాన్పించెడిని. అంగుచే నిప్పని నియ్యెడనేబంధించుట యుత్తమంబయ్యెడు.

శకు:— వ॥ హా, సుయోధనచక్రవర్తీ

ఉ॥ పాండుకుమారు లేవురకు బల్మియె కృష్ణుడటంచు భాగమీ
నుండిన ముజ్జగమ్ములను నొప్పగ నానపకీర్తి వారితో
భండనమాడలేక సగ భాగమొసంగిరటంచు మీకు మీ
దండవసించు వారికివి తథ్యము దీనితలంపు మెంతయున్॥

వ॥ తామింతటి బలోన్నతిని లోకంబెల్ల నేకచ్ఛత్రాధిపత్యమ్మగా నేలుచు నిరాయుధుండగు నానందనందనుం డప్పాండుతనందనులయెడ వర్తించునను భయమ్ముతో నవ్వారల కర్ధరాజ్యంబొసంగం

జూతుఁడా! అద్దానవీరాకు న్యూనమ్ము సంఘటించుటేగాక మీరాచెంత చిరకాలమ్మునుండి యోధానయోధులనుయసమ్మున నలరారుసీమా గారవమ్ములును నేలపాలగుగాన ప్రపంచమ్మున గారవమ్ముగోల్పడిన పై బ్రతికియుండియు నిరర్థకమేగదా.

దుః— వ॥ ఔనౌను మాతులా, కార్యసిద్ధికి దైవబలమ్ముగదా యావశ్యకము. అయ్యది లోపించిన మనపౌరుషప్రతిష్ఠలచే నేమిగానున్నయది.

కర్ణుః— వ॥ ఆహా కరిపురాధిపా,

ఉ॥ ఇందఱ మిన్నిరీతులుగ నెల్లగలంపుచు నుండ పాండుభూ
నందను లెంతవారు ను నాదుప్రతిజ్ఞ సురేంద్రుడైన నా
నందకుమారుడైన ధన నాయకుడైన నుమేశుడైన మీ
ముందరగట్టివైచి యశ ముగ్గనువాడ సుయోధనా ఘనా.

వ॥ ప్రపంచమ్మున మనుష్యకులమ్మునకెల్ల తలకట్టనమెప్పు క్షితితలేశ్వరకుల సంజాతులమై యయ్యాదునందనుని సాయంబున రణంబొనర్పఁ దలంచు నప్పాండునందనులకే జంకవలెనా! తాము గోరిన తమయాజ్ఞానుమతమ్ముగా నేడేను పదునాల్గు భువనమ్ములం గల్గుశూరాగ్రేసరశిఖామణులనేగాక నభ్భువనాధిపతులనుసహా గరపాదమ్ముల బంధించి నిముసమాత్రమ్మున భవత్పాదారవిందములకడ నిల్పంజాలనే? తొల్లిటినుండి మదీయబాహుబలపరాక్రమవిక్రమస్థైర్యమ్ము లెఱింగియు మీరిఁ తదీనతమునుంగ కారణంబరయ గోరెద.

దుః— వ॥ కర్ణా, అప్పాండవులలిన నామనంబేమో తత్తరమందెడిని.

కర్ణుః— వ॥ మహానీయా,

ఉ॥ ఏవురనొక్క వ్రేల వధి యించగజాలిన యట్టినేను మీ
తావున నుండమీరు భయ తత్పరతంగృశియించనేల నో

దేవర మీ రిరుంగిరే సు ధీరునినన్ను ను నాబలమ్ము మీ
కేవిధిగా వచింతురో చ రింతునటుల్ జవదాట బోవకర్॥

వ॥ అన్నా, యిట్టినాకంటె వేయిరెట్లెక్కుడు బలపరాక్రమమ్మున
నలరారు రాజన్యులసంఖ్య లెక్కకు మిక్కుటమైయుండ యీ మీ
బుద్ధిచాంచల్యమరయ మన కీర్తి వంశాళి కెల్లయు కాంతితగ్గుచుండెడి.
ఇంతకు మేమెంత యోధులమైనను తాము ముద్రధారులైన కతమ్మున
తమయిష్టానుసారంబుననే వర్తింపవలెనుగదా. అయినను మాసరివా
రిలో మమ్మింత చిన్నబుత్తురని కలనైన దలంచియుండము. దుశ్శా
సనా, వింటివిగదా తమ యగ్రజుని వాగ్విలాసములు.

దుశ్శా:- వ॥ అగ్రజా సుయోధనా,

చ॥ కురుకులవార్ధి చంద్ర తమ కుర్ జనియించినయీయ ధైర్యమా
మురహరుగాంచి యో వెనుక ముందును లేక న శేషకీర్తిచే
తరువులక్రిందనుండు పిన తండ్రికుమారుల ఘాకగాంచి యో
సరుగున దెల్పుమయ్య విన జాలనిచో తమయంత వారికే
గిరపెడి దేమిభాగమిడ మదిగల్గిన నిమ్ముపొమ్మికర్॥

వ॥ తాము రాష్ట్రాధిపతులైన దాదిగా నిప్పటివర కీచతుస్స
ముద్రముద్రితాఖండ మహీమండలమ్మునగల రాష్ట్రమ్ములనుండి
యొందరెందరసమానశూరత్వమ్మున నలరారు యోధులిటకేతెంచి
మనచే నోటుపడియుండరు. ఇట్టిమామా ప్రతాపంబుల నెఱింగియు
మీరింతటి యధైర్యమునకుర్ దలయొగ్గనేల?

దు:- వ॥ ఔనౌను మీరమితశూరత్వమున చరించువారలుగాదా
సోదరా,

ఉ॥ ఎక్కడ బోయె మీబలము లెల్ల బలాన్వితులవ్విరాట్పురిన్
జిక్కినవేళ పార్థునియ శేష శరాహతిగూలువేళలన్

ఇక్కడి వ్రేకూతలకు నేమి ప్రయోజనముండు పాండవుల్
గ్రుక్కరె యెవ్వరొక్కరుః గూడిన నెందరినైన తమ్ముఁడా॥

వ॥ ఓరీ దుశ్శాసనా వంటయింట భోజనకాలమ్మున శాకపాకమ్ములపై జూపందగు మీమీపరాక్రమమ్ములు రణరంగమున కుపకరించునే యేలయీచేతగాని పల్కుల నిదివరకుండు యశమ్ముఁ దూలజేసెదరు? సమంచితకీర్తినొప్పుటే ధర్మంబు.

దుశ్శా:— వ॥ అన్నా ఎంతకళంకమ్ముఁ జెందినాడవు.

మ॥ ఎపుడో పాండవులవ్విరాటుపురమం దేయుక్తినోపన్ని యీ
నృపముఖ్యాళిని నోటుబుచ్చిరని వారింజూచి మీకిట్టులఁ
చపలత్వమ్ము జనింపకున్న మననే జాడందగఁ గెల్తురీ
విపరీతమ్ము గనంగ చిత్రమగు నీవే వారి భాగమ్మున
త్కృపతో బాచియొసంగిపంపుమిక దుష్కీర్తిఁ వెసఁ గాంచఁగ॥

వ॥ అగ్రజా యింద్రమహేంద్రజాలప్రయోగమ్మో గాకున్న నొక్కశరంబేడ పదునెనిమిదక్షౌహిణిసంఖ్యఁ దనరారు రేరేడుల మూర్ఛిలజేయుటేడ మీకుగాకున్నను లోకమ్మునకెల్ల నద్భుతమైయే గాన్పించెడిని గాన తమయీప్సితగతినే నరవేర్చుకొనుడు.

కర్ణు:— వ॥ అన్నా నేనింతటి యోధుండనై యీనాటికీమూర్ఖునిచే నెంతదూష్యుండ నైతి.

దు:— వ॥ ఓరీకర్ణా సందడిలేనప్పుడందరు శూరాగ్రేశరులే గాని సమయమువచ్చిన నొక్కరును గాన్పించరు అయిననట్టి పాండుసూనులముందు

ఉ॥ ఎందరమున్ననేమి మరి యెందరు జేరిననేమి పాండుభూ
నందనుడైన పార్థుడల నందుని పట్టిని గూడి సైన్యముఁ
దిందరజేయ నిల్పదగు శేవనెఱుంగక పాఱిపోవ మీ
రందఱు నందరైతిరి గదా యికచాలును పొమ్ము కర్ణుడా॥

వ॥ ఓరీ పరాక్రమశూరత్వమ్ముల మీకన్న నెక్కువగలవారు గాదని యుపాయమ్మును నుండరని యే నాతలంపు. ఏమన రణరంగమున నిల్చి యుద్ధము జేయునంతటి ధీరత్వము లేకున్నను పాఱిపోయి ప్రాణ రక్షణంబొనర్చుకొనుదానికంటె నుపాయంబన్న వేరొకటున్నదో!
శకు:— వ। సుయోధననృపోత్తమా, యేల నీపరిహాసవాక్యములచే మామా గౌరవమ్ముల గీడ్పడజేతువు. మదీయాభీష్టమ్ము నించుక వినుము.

ఉ॥ వంచన లేక వేగనల కే వారిని ఖండనమాడు గూల్చినన్
గాంచగి వచ్చు నప్పుడధి కే కారిను మీరలు వారెకూల్చినన్
మించిన స్వర్గసౌఖ్యముల కే మేకొనియొప్పగ వచ్చు నిందు యో
చించెడు గార్యమేమి తెగ కే జెప్పుడు లేదని భాగమెంతయున్.

సు:— వ॥ ఔనౌను, నీతలంపే యుక్తంబై సూచించెడిని. నీవ్రవచించిన రెంటియందును గొప్పఫలితము లే నిండియున్నయవి. అటులైన నిందరమై వారికి వెరచి యర్ధరాజ్యంబొసగి యిది వరకు మనమాచరించిన దుష్కృతమ్ముచే గౌరవాదినరకమ్ములన్ బడి చింతిలుటకన్న బ్రతుకువరకు రాకులుబు వెనుదగ్గిలేదను యసమ్మును పిదప కదనమ్మున నోడ్పడి ప్రాణమ్ములగోల్పడిన దాన వీరస్వర్గమ్మును జెందుట ఫలాతిశయమ్ముగాదా! (అనిస్వగతమున నెట్లుగాను న్నదట్లే యగునని తలచుచు పైకిమాత్రము) నేనిదివరకనిన సంగతులెల్ల ప్రతివారి నిజాభిప్రాయమ్ములే గుర్తెరుంగుటకుగాని యప్పాండవులేవురకు నీమనకర్ణుండొక్కగుండు జాలకున్నె. అతండు నాపల్కువచనమ్ములన్ బట్టి నాపైనల్కజెందినటు గాన్పించెడిని. అయిన నొక మాటు బలుకరించి చూచెద నుగాక. అంగరాజా నీవు వచించకున్నను నీబలంబే నెఱుం

గనే. నీనుంచిగాదే నేనీయప్తైశ్వర్యములఁ దుర్లభమాగు
చుండుట. (అనితలవంచుకొని క్రిందగూర్చున్న కర్ణునిచేయి
బట్టి లేవదీయును.)

కర్ణు:— వ॥ నృపా నీవిదివరకాడిన కర్ణకఠోరవాక్ప్రశంసచే నంతకోపో
జ్జ్వలుండనైతి. ఐన నప్పాండవుల నరణ్యముల పాలొనర్ప
నేనొక్కండను జాలనో. ఇయ్యదియు నీవెఱింగినదియే
గదా!

ఉ॥ పుట్టుట వేరుగాని మన । పుణ్యపుపద్ధతి మీరు నేను నీ
నుట్టున నొక్కచోట విను । మా భళియుండుటె గాక నేమి లో
గుట్టును లేక మర్మమును । గూడ నెఱుంగక నున్న నన్ను మీ
రట్టిటులాడ జెల్లునొకొ । యారయుమా గజపత్తనాధిపా.

ధృ:— వ॥ పుత్రా, యేలయిట్టియుబ్బుసు పల్కులచే తబ్బిబ్బె శోభ
స్కరమ్ముగా వర్థిల్లు కురువంశవృక్షమును నశింపఁజేసె
దవు. ఇపుడునీకడ పడావులుగొట్టిన వారలనెల్లరినెన్నిప
ర్యాయము లప్పాండవులోడింప నీవువీక్షించి యుండవు॥
ఇందునగుఱించి మీయుభయులకు సంధినొనర్ప మహాను
భావుండైన కృష్ణుడును విచ్చేసియున్నాడుగాన అంధుడనని
నావచనమ్ముల నిరాకరింపక నిసుమంతశ్రద్ధచేనాలింపుము.

దు:— వ॥ జనకా నీవేమిజెప్పనెంచితివి?

ధృ:— వ॥ పుత్రా,

ఉ॥ మీరలు నూర్వురఁ మరియు । మీపినతండ్రికుమారు లేవురఁ
కూరిమితోడ సంధినొన । గూర్చుక నొండొరులెంతొ ప్రీతిమై
ధారుణి నేలుచుండగ న । దల్చివచించితి నోకుమార నా
కోరికెమీర నీకు నొన । గూడదెకష్టములయ్య గాంచుమీ॥

వ॥ కుమారా యీకొద్దిపనికి త్రిలోకస్తుత్యుండగు కృష్ణభగ
వానుడును దయచేసియున్నదాన నాయన కెంతకును నెదురాడనుంకించ
కుము. ఎందుచేనన

చం॥ జగములనేలువాడు మన । జాడలనెపు గలంచువాడు యా
త్యగణితధర్మశీలు డవ । తారము లెత్తిన మేటి వేడ్క మీ
పగవడజేసి భూరమను । బంచియొసంగగ నేగుదెంచె నా
నాఖగగమనుండు జెప్పినది । గాదనక శిరసావహించుమీ॥

వ॥ అట్లొనర్పకున్న గావలసిన ననుభవములన్నియు కొద్దిలోనే
తటస్థమౌనని నిస్సందియముగా దలంచుకొనుము.

దు:— వ॥ తండ్రీ, జాత్యంధత్వముచే సర్వదా మంచమునబడియుండు
నీవును, నయ్యాదవాధముండును వచించుకరణిని బోకున్న
మాకుకష్టము లొదవునా?

చం॥ ధరజనియించువేళ నల । దాత లిఖించిన వ్రాలు కైవడిన్
జరుగును, భిన్నమొంతయును । జర్పగలేడెవడైన నెందుకీ
కరణిని బల్కెదీవు మృష । గాదిది నీవును గృష్ణుడల్గినన్
ధరణిని బంచి యిత్తునని । దల్పకుడింకొక నాటికేనియున్॥

గాం:— వ॥ నాయనా, సుయోధనా, మీతండ్రితోలుదొల్త నాకృష్ణ
దేవునితో పాండవులకుభాగమొక్కడిదని కొంతవడికి బోరా
డెనుగాని తుదకమ్మహానుభావుండు కోపోగ్రుండై యుభ
యులము కురుక్షేత్రమ్మునగూడిన వేళగాని యెవరికెవరు
భరణమిచ్చునది యగుపడదనునంతలో నమ్మహానుభావుని
కోపమునకు వెఱచి ఈయన చెప్పినట్లు పాండవులకు భాగం
బిడకున్న వారివైపుననిల్చి యుద్ధముసేయసమకట్టు నను
తలంపుతో నీకంతగా నమ్మహానుభావునితో యుద్ధముగాని
వారికి విరోధించిగాని యుండజనదని బోధించె. నిశ్చ

యముగా యాతండులోకమందు దుష్టశిక్షణ శిష్టరక్షణజే
యుటకు గాదా దశావతారము లెత్తుట. అట్టిమహాత్ముని
జయించుట మనుష్యమాత్రులకు సాధ్యంబే. గాన నాకు
ల్కుల నించుక కర్ణేంద్రియముల జేర్పుము.

చం॥ వరసుకుమార పాండుకురు । వంశము లెంతయు వృద్ధిబొందు శ్రీ
హరియవతారమూర్తి మిము । నందరి నొక్కవిధమ్ముగా మదిక్
యరయు నికేమి లోపమిట । నుండదు, సంధిచె నెల్లరమ్ము, ము
ష్కరమగు చింతవీడి కడు । సంతసమందగ వచ్చు నయ్యయో॥

వ॥ నాయనా, కుమార,

ఉ॥ ఇందున బెద్దపేరు వహి । యించుటెగాక రమాధవుండు నీ
నీయందున సత్వభావమున । నందగజేసెడి నీప్సితాళి యో
నందన నీవు పాండునృప । నందనులా యదునందనుండు నిం
పొందగ గూడి యుండపరు । లోపుదురే నిను బల్కరించగన్॥

దు:- వ॥ తల్లీ, స్త్రీలకాలోచనాభావము కలుగుచయును నార్యోక్తి
నెన్నండును వినియెఱుంగవో. అయిన నీకాచరికవ్యవహార
జోలి నీకేల? దయచేసి వెడలుము.

భానుమతి:-వ॥ ఆహా, తల్లిదండ్రులవచనమ్ములనే విశ్వసింపగ నిరసిం
చిన వల్లభుండు నావిజ్ఞప్తిని మాత్రమాలోచింపనుండునా.
అయిన నాయదృష్టమెట్లున్నదో దెల్వదు. చేరువకుజని
మనవిజేసికొనియెదగాక. నాథా

దు:- వ॥ దేవీ

సీ॥ తోడికాంతలవీడి । తోయజాక్షిరొయిట్టి
రంగస్థలమునకు । రాబనేమి
సింహేంద్రమధ్య నీ । చిన్నెలెల్లనుచింత
గల్గినట్లగుపడ । గా బనేమి

కళ్యాణినిగని కడలేసిభీతిచే
గుందుసీధవునిగ గొనవదేమి
కన్న డాబిల్చిన కన్నత్తి ప్రీతమై
చేడరోనాతోమా టాడవేమి

గీ॥ మలయమారుత వేళను మగువలెల్ల
రాగశరముల మరునిచే రంగసీక
బరపెదరు నీవటులెచక్ర వాకబాణ
మంది జనుదెంతువేమొ యో కుందరదన॥

వ॥ చెలీ, సీవిట్టి భీతహృదయవై యేలచరించెదవు?

భాను:— వ॥ నాథా, తామీరీతి వర్తించుకతమ్మునచే

(7వ కీర్తన డైలాగ్.)

దు:— వ॥ ప్రేయసి, నేనొనర్చిన లోపములేమి; నన్ను గురించి నీవు చింతిల్లుటకేమి హేతువు?

భా:— వ॥ మహాత్మా భవదాజ్ఞరీతినివచింతుగాని క్షమింపప్రార్థితులు.

దు:— వ॥ సాతీ, నాకడనీకే వెరపేల వేవేగ దెల్పుము.

భా:— వ॥ అట్లైన నాథా, యాలింపుము

ఉ॥ ఏలగ రాష్ట్రముల్ మఱియు నెక్కి-చరింపగ స్యందనమ్ములు
మేలగు సైన్యసంతతులు మిన్నునకంటిన యట్టిమేడలు
జాలగలుంగ నేమి భువి సార్థకమందరికి విరోధివై
యేలచరింతు వట్టులది యెన్నటికైనను చేటుగాదొకో॥
జీవితేశ్వరా!

ఉ॥ ఎంచగ పాండుపుత్రులకు నేయయిదూళ్లనో కోరురీతి వ
ర్పించిన తక్కు-వౌను భళి పిన్నటనుండియువారు మీరలా

ర్జించన భూమిగాదె తగ ƒ రేయిటుపాల్గొన నివ్వకున్న నొ
ప్పించరె మిమ్ముసైన్యమును ƒ పీచమడంచరె ద్రుంచరేగనన్॥
దేవా,

ఉ॥ చెప్పుడు మాటలన్ వినియు ƒ చేటును జేకొనకయ్య తప్పకన్
ముప్పుఘటిల్లునయ్య తమ ƒ మూర్ఖమదేమొ యెఱుంగనయ్య నా
తప్పుక్షమించుమయ్య నృప ƒ ధర్మము వీడకుమయ్య పాండవుల్
గొప్పబలాఢ్యులయ్య విను ƒ గోపసుతుండు సహాయమయ్యయో॥

దు:— వ॥ దేవీ, యీగొల్లవాడప్పాండవులన్ జేరి మమ్మెల్లరిని జయిం
తురని చింతింతువో. కాదు కాదు. చెలీ, భాస్కరుండు ప
శ్చిమాద్రిపై నుదయించినను మనకట్టి కష్టమ్ములు సంప్రా
ప్తించవని నమ్ముము. యేమన?

ఉ॥ ఓయువతీ జయించి యశ ƒ మొందగ వారితరంబె మమ్ము న
వ్వాయుసుతుండు ఫల్గుణుడె ƒ వారలలో బరశీలురింక ల
క్ష్మీయుతుడైన కృష్ణుడటు ƒ జేరినవారల నుక్కడించ రా
ధేయుడు ద్రోణభీష్మనృప ƒ ధిరులు యీవలలేరె గాంచగన్॥

భా:— వ॥ జీవితేశ్వరా,

ఉ॥ వారలు మీరుబోరుగొన ƒ వాస్తనమిర్వురకున్ జయమ్ముచే
కూర్చదు, ముప్పుమీకొన ƒ గూడిన వారలకున్ జయమ్ము న
వ్వారలకీడునొంద తమ ƒ వాంఛితలీల జయమ్ముగాంతు రె
వ్వారలు చింతలేక సుఖ ƒ వార్ధినిదేలెదు మాడ్కిభారమున్
చేరెదు నివ్వసద్యశస్సు ƒ జేకుదు దీనిదలంచుమయ్యయో॥

వ॥ మహాత్మా, ఇంకను,

గీ॥ ధరను పాలించ రెందరు ƒ దర్లువేళ
వెంటగొనిరని మాత్రము ƒ వినగలేదు

తామటులె గాక నాచంద్ర । తారకముగ
నేలెదో యేల యీవట్టి । బేలతనము॥

వ॥ నాధా,

ఉ॥ ఇంతకు ఫాలమందులిఖ । యించిన వ్రాలిటులుండ మిమ్మనన్
యెంతటిదాన కర్మగతి । యెట్టులనున్నదొ బుద్ధులటులే
చెంతనుగూరుచుండు నిక । చెప్పెడిదేమి యద్రుష్టహీనతన్
యెంతటి సౌఖ్యసంపదలు । నేనియు చెప్పకపోవె వల్లభా॥

దు:— వ॥ వల్లభి, నీవు దీనినిగురించి యింతగా వగవబనిలేదు. గాన వేవేగ మందిరమునకరుగుము.

భా:— వ॥ చిత్తము దేవా.

దు:— వ॥ గురువర్యా కురుపాండుసైన్యతలేశుల బలాబలమ్ములు తమకు కరతలామలకమేగదా, యిందున కృష్ణుండరుదెంచిన రాయబారవిషయమున తమమనంబేరీతి వర్తించెడినో దయచేసిశెలవొసంగుడు.

ద్రో:— వ॥ శిష్యవత్సలా నిజము నెరింగించ వలెనుగదా.

గు:— వ॥ మహాత్మా మిమ్మునాశ్రయించుట నిజముగు ర్తెరుంగుటకు గాదా.

ద్రో:— వ॥ శిష్యా, అట్లైన నుడివెద నాలింపుము.

ఉ॥ ఒక్కడె పార్థుడెల్లరిని । నొంచుబలోన్నతు డింక నాపయిన్
దక్కినవారు నల్వురిట । తగ్గులమొగ్గులకుంద్రు కృష్ణుడో
యెక్కుడు శ్రద్ధచేత మము । నెల్లరసమ్ములబిందుజీవముల్
దక్కవసించు వారమిట । తప్పిన నూటికి నొక్కడుందునో॥

వ॥ కాన నవ్వారల శస్త్రలాఘవమ్ములును బలాబలమ్ములును నాకును మీతాతయగు భీష్మునకును నెఱుకయేగాని యివ్వీరులకేమి

గురుతు, అందున ముమ్మాటికి సంధియొనర్చుకొనుటయే నాయభీష్టము. నీకిష్టములేక సమరంబేయొనర్చిన నాశక్తికొలది మెలంగెద.

కర్ణు:— వ॥ సుయోధనా, పెద్దలని ముప్పొద్దుల నెద్దులమేపినట్లు మేపి నందులకట్టి పెత్తనమునైన దక్కించుకొనక నీద్రోణుండు ను నందనందనునిమాడ్కి దినినకొంప గుద్దలింప యత్నించుచు యుద్ధంబన్న వెనుదగ్గి పాండవుల పక్షమే మాటాడ దొడంగె. భీష్మకృపులును నందున జేరినట్లోచెడిని. (అనునంతలో)

భీష్ము:— వ॥ ఓరీ సుయోధనా మనగురువరునిపల్కులు తబ్బరలను కొంటెవాగేమి. కాదుకాదు, నీవిషయమ్మున పాండవులు కోపమానసమ్ముననే వర్తించువారలు. యేమన?

ఉ॥ సమ్మతితోడ నీయడిది । సత్యముమానగ భాగమంచు కో
పమ్మున బాండుసూనులిటు । నైవగనుండు శరాళిగాంచి శ
త్రుమ్ముల జాకబెట్టి తమ । జావులదప్పికొనంగ నింటిదూ
లమ్ములబైచబాముకొను । లావుగలింగిన నూచకాళ్ళపై
దమ్ముల నమ్మి యుద్ధమున । దార్కొనుబూనుట నీకున్యాయమే.

కర్ణు:— వ॥ సుయోధనా, నేనిదివరకు జెప్పినసంగతి(దగ్గరజేరి చెవులో జెప్పును) యిప్పటికైన తెలిసెనా! నీవు మనస్సున విను ర్పించక దగ్గరదీసినకతమ్మననే కొంపకింత చేటుమూడినది.

భీష్ము:— వ॥ ధృతరాష్ట్రినందనా మమ్ముల (భీష్ముని ద్రోణుని) నెన్ని దురాక్షులాడినను నున్నస్థితిజెప్పెదము. మనమెల్లరము పాండవులకు కృష్ణసాయము లేకున్న జయింపకున్నను కొంతవఱకు పోరాడగల్గుదుమేమో. యిక కృష్ణుండే యట వర్తించిన

ఉ॥ నందకుమారుడైన యదు నాయకు డద్దరిజేరివారికిం
కొందుల కన్యమానవుల హీనదవృత్తిఁ దలపోయుమా జగద్
వందితు నాజ్ఞయైన నృప వర్యులపోల్కి భవజ్జనమ్ముపై
పందిరిగుంజ లెల్లశహ భాసతిదూకి రణమ్మునర్పవో॥

వ॥ నీపైన కృష్ణునకుంగల్గు నీర్ష్యయిప్పుడు తగ్గునని యోచింతు
వాయేమి, కాదు కాదు.

గీ॥ మాయద్యూతమ్మునందు ధర్మజునికల్మి
గొన్నరీతిని నిపుడుని కున్న నెల్ల
కక్కువరకును వీడడ ఖండకోప
వృత్తినున్నాడు మీ ప్రాప్త మోములదెలియు॥

కృపా:— వ॥ సుయోధనా, ద్రోణభీష్ములవచనంబులన్నియు వేపము
లోని ముక్కలనవలెనే గాని యన్యమా, అయిన నీవెంత
విచారణలేక వతిఁగాంపజూతువు

గీ॥ రాజరాజువె గాని యే రాజునకును
వంటి ధైర్యముగలదా క నృప్పజాల
వినినీవేని రణముగో శంకలేక
జయముగొనజాలదయ్య ని ర్భయముగోడ॥

ఉ॥ నృపా జూపుము నీప్రతాపమున శూరులనల్వుర నీబలమ్ముగో
ద్రాపుగ పాండుపుత్రకుల పైబడి యుద్ధమునిల్పి సేయగఁ
గోపము వీడి సంధినోన గూర్చుకనూడినమేలు గానిచో
మాపులమాయజేతురిది రూఢిదలంపుము కౌరవాగ్రణీ॥

గీ॥ శ్రీపతికైన జంకని భూ పకులకు
తమబలమ్ముల గూల్పనౌ తటి ప్రయాస
మరయుము పదుగురొనను కరణివారి
యర్ధరాజ్యమ్ము సంగి మర్యాదగనుము॥

కర్ణు:— వ॥ సుయోధనా, ఆగొల్లంకును, నప్పాండవులును వారివారి
సామర్థ్యంబుల మనకడబొగడుట్కై. యీముప్పురకెంత
విత్తమొసంగియుందురో. పిలువనిపేరంటమునకు పీటగొని
వచ్చినట్లీ ద్రోణ, భీష్మ, కృపుల నెవ్వరు వారిసామర్థ్యమ్ము
ల వినకుతూహలురైయడుగగా జెప్పందొడంగుచుండిరి.
పనిలేనియాంగారకుంగు మార్జాలశిరమ్ము నున్నుజేసినభాతి
యీనిరర్థకప్రలాపముల జాలింపకున్న కంఠమ్మునకును నిం
చుక శ్రమకాదని బోధించున.

భీష్మ:— వ॥ ఓరీ కర్మదాంధా, ఎంతటియహంకారుడవురా. త్రిలోక
మ్ముల నసమానశూరత్వమ్మున నలరారుచు నమితవిక్ర
ముడను నామమ్ము వడసిన నీద్రోణాచార్యులను, నేనును
నీకు తృణమ్ములపోల్కి నగుపడుచుంటిమిగా. భ్రష్టా,

గీ॥ నూరితృణమనుగాక భూ కి పుడవేరి
పగులకొంపల కడనేల కి బడినొలగె
గిచ్చుపడదీన నుడుపులిం కి కెప్పునైన
నుడివిని ప్రాణముల గోలు కి పడెదనమ్ము॥

ద్రో:— వ॥ మహాత్మా, భీష్మనృపాలా, వీనికీయహంకృతి సుయోధను
నిచే గల్గినది. ఆతనిసాయంబె లేకున్న వీనియుక్కణాచ
నాదరుకావలె. ఇష్టునైన వీనిగారాలాపముల మాయశ్వ
త్థామయే వినినన్నొక్కమాటుగా నాదిశక్తి కుపాహాగమొ
సంగడో (అనుచుతోనే భీష్ముకు, ద్రోణ, కృపుల కర్ణునిపై
కొంచెము కోపాగ్ని జూపమనును.)

వ॥ ఓరీకర్ణా. నీయహంకార మడగుదివసము వచ్చినయది.

గీ॥ వారినీతోడ కి వారినల్లిమ్యోడ
నాగదేమి నీదు కి ప్రేగుతెల్ల

జందెములుగ దాల్చి - జరియింప బూనుదో
ఱాడు భీష్ముఁడంచు - నుర్విఁ దలంచు॥

కృపా:— వ॥ ఓరీ దుర్మదాంధా,

గీ॥ అన్నదమ్ములు లేనట్టి - యనదవంచు
నెంచి యీసారి నిన్ను ర - క్షించితిట్టి
దుడుకులాడిన నొకపరి - ద్రొక్కిపట్టి
సాఁగదీయనిచో కృపా - చార్యుడనొకొ॥

వ॥ కాన జాగ్రత.

అశ్వ:— వ॥ జనకా, మాతులా, యేరిపై నింత క్రోధావేశముఁ వహించితిరి. మిమ్మిందున నెవరయిన జిన్నబుచ్చిర యేమి. (అనునంతలో కర్ణుండొక యర్ధచంద్రాయుధముఁగని క్రోధమునొంది)

కర్ణ:— వ॥ ఓరీ భీష్మ, ద్రోణ, కృపాచార్యులారా, మీరుమువ్వురును పాండవపక్షపాతులై మాసుయోధననృపాలుని రాజ్యభ్రష్టునిగా నొనర్పయత్నించుటేగాక నన్నుఁ గూడ జంపనుంకించుచుంటిరిగా, యిదిగో రండు, మీమీబలంబుల నారసి తక్షణంబ కాలుపురమున కనిపెద. (అనిపైకి నురుకుచుండ సుయోధన దుశ్శాసనాదులడ్డము వచ్చిపట్టుకొందురు.)

అశ్వ:— వ॥ సుయోధనా, అడ్డగించకుము. అయిన నెందఱిబజ్జీమూర్ఖునో చూచెద. నీబ్రతుకునకు మాతండ్రివి మాతులునే గాక కులకులోత్తమునిగుండ దెగనరుకువాడవా. అయిన నీసుగతమ్ముఁ గాంచ నీయశ్వత్థామ చేచియున్నాడు. రమ్మురమ్ము. బ్రాహ్మణులకు భోజనకదనంబేగాక రణరంగంబన్న దెలియనిది గాదా. యిట్లు కాలుగాలిన మార్జాలమురీతి పేరేమునెత్తెదవు. అడ్డగించుచుండిరవియో మరింత

పరాక్రమమతిశయింప జేయుచుంటివి. ఓరీ, మేమన్న నీకం
తపేలవముగా నున్నదిగా మూర్ఖా.

చం॥ నిలునిలు పోకుపోకు కదు ? నిక్కదవంత బ్రోన్నతుండవో
కలచెద ద్రోణ. భీష్ములన ? గన్నులకున్ గనుపించ లేదుగా
పిలచినరీతి వచ్చితివి ? పేరము లెత్తిన బోవనిత్తునే
దలచుకొ తల్లిదండ్రులను ? దాకొని మృత్యువునిన్ను కర్ణుడా॥

దు:— వ॥ ద్రోణతనయా, శాంతింపుము, శాంతింపుము.

అశ్వ:—

ఉ॥ అడ్డము లెందు లెందు పుట ? మార్పెద నిన్ గని గారవింపనా
గ్రుడ్డి సుయోధనుడనుచు ? కూళదలంతువొ ద్రోణసూనుడన్
బడ్డది వైరమిర్వురకు ? వహ్వారె నాపిడికిట్టు బల్మిపై
బడ్డని తప్పకోర తల ? బ్రద్దలుగాకయ నూరకునట్టులన్॥

గీ॥ బ్రాహ్మణుండని గాద మా ? బాబుపైకి
మాటికిని కాలుద్రవ్వగు ? మదము చేత
పొమ్ము యీసారి నీపర ? క్షమ్మదెల్ల
బీల్వకుండిన మారుపే ? ర్పెట్టుకొననే॥

కర్ణ:— వ॥ ఇట్టి నిరర్థక వాక్యములకు జంకువారలుందురు నియా యే
మేమో ప్రేలెదవు. యెప్పుడోగాను యిపుడే వెడలన్ జూతు,
సమర్థుండవైన వేవేగ నే తేడుము.

(8 వది డైలాగ్.)

గీ॥ అడ్డగింపకుడయ్య వీ ? డైనన్ను
గొట్టిపోవుటగాంతు ? నోకుంక నీకు
కర్రలా ఖడ్గముల లేక ? గదల నొక్క
మొట్టు మొట్టిన యమపుర ? మ్మునకు జనవో॥

వ॥ కాన జాగ్రతగా బ్రతుకుము.

దుర్యో:- వ॥ గురుపుత్రా శాంతింపుము. భీష్మద్రోణ కృపులాతా యవ్వానితో నేమిగానున్నయది. నాపైదయోన్నతులై మీరలిందు మనోనిశ్చయమ్ముగా గాంచి వర్తించకున్న నేనేమియొనర్తు. పదుగురువినబోసంగిన యీరణరంగమును సంక్షేపించుకొనుటయు నయుక్తమ్మగాన ననుగ్రహించ ప్రార్థితులు.

అంగరాజా యిపుడీసంధికై యరుదెంచిన పాండవపక్షపాతి నేదేని పరాభవింపకున్న మరొకప్పుడును నిల్లేతిర స్కరించి మాటలాడు. అయిననింకను కొంతమట్టున కీతని నిటవర్తింపక జేసిన మేలయ్యెడిని. ఏమన వీడందున జేరక మున్న యపాండవులని కరుదెంచుచో నొక్కమాటుగా బరిమార్పవచ్చును గాన వేవేగ యత్నింపుము.

కర్ణు:- వ॥ సుమిత్రమా,

గీ॥ పట్టికృష్ణుని పాండవ పక్షమూన
వనెడి మాటాడువరకు నే మైనగాని
దిట్టముగ గట్టియుంచుటే దిట్టదనము
గానవేవేగ రండు చిక్కడికవీడు॥

వ॥ అయిన మనకెందుల కింతశ్రమ. రేబవలొక్కరీతి మందగాచు నుద్యోగమ్మున వర్తించమీగొల్లండెటు జేరిననేమిగా నున్నయది. ఈతండేమొ యస్త్రశస్త్రముల నందాననిమునుదలంచి యప్పాండవులకితడే బల్మియని యెంచితిగాని యిపుడంతయు తెల్లంబైనది. అంతియగాక రాజకులచూడామణులమై తొలుదొల్తనుండి విలువిద్యలయందతిప్రౌఢిమచే నొప్పుమనపై కాతండు రానిచ్చగించునో, వచ్చినను నిట్టినిరాయుధుని సాయమ్ముతో కయ్యంబొనర్పయత్నించు నప్పాండ

బల్లాండిన వానికెల్ల శుభరూప్పి ॥ చరింతురుగాదా యిందుమీా
నిరెడిన మానవమ్ములను ॥ నిల్తురుగాదా యదేకనుండికర॥

కీర్తన· (పాండవులజేరి) రివది.

కృ:- వ॥ దుర్మదాంధులారా, మీామీా శూరత్వములిప్పుడే వెల్లడియగు. మీాకొరినరీతిని నేను పాండవులఁ జేరి రణరంగమ్మునకేతెంతు. లావుగల దొరలు వేవేగ నటకే తేరుడు.

కర్ణు:- వ॥ ఓరీ యాదవకులపాంసనా,

చ॥ పొలుచెను నీముఖమ్మునన ॥ మూఁకనామములంచునీకు సద్
విలసతకీర్తి నొప్పు నృప ॥ వీడులు తగ్గుదురో కొ- రమ్మురా
వలసనరీతి నీదుహితవర్యులగూడి ॥ బలాబలమ్ములన్
దలపడి జూచుకొందమిక ॥ దాపరమెందులకోరి మాధవా॥

వ॥ ఏరా, నీకంటెబలహీనులుందురనియా యేమేమో ధట్టించి సంభాషింతువు. నీకు సమరంబేప్రియంబైన కలయంబైన నట్టిరంగస్థలమ్మువిడుతురని మాత్రమూహింపకుము.

కృ:- వ॥ కౌరవాధములారా, యేనుపాండవులఁ జేరి రణరంగమ్ము ప్రవేసించిన బలాబలమ్ముల చూచుకొన నిచ్చగించితిరా అటులైన యుగమ్మెల్లపడిమారినను భిన్నంబుఁగాని మత్ప్రతిజ్ఞ నాలింపుడు. భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామలారా, మీారును నిసుమంతశ్రద్ధఁ వినుడు.

ఉ॥ అట్టులెనేను పాండవమ ॥ హానృపపుత్రుల పక్షమూన మీా
పట్టున నున్న కౌరవనృ ॥ పాలకుమారుల పాదఘట్టనన్
మట్టుచు హాస్తినాపురికి ॥ మానక ధర్మజురాజుజేసి య
ప్పట్టున మీాకుపిండముల ॥ వైచకనుండినచో మురారినే॥

వ॥ అన్నా, యేడేడు పదునాల్గుభువనమ్ములన్ స్వేచ్ఛారీతిఁ మార్పులొనర్పఁ గల సమర్థుండనగు నన్నే యాదురాగతులీరీతి నెదు

రోకాన జూచుచుండ నికమాటలతో ధర్మరాజాదుల భాగమ్మునంగ
నుంకింతురో. గాంగేయా, తొలుదొల్తనుండి భేదమ్ము లేక వారికష్టములే
మాకష్టములుగా గని పెద్దజేసిన కతమ్మునగదా నేనిప్పుడిట్టి దుర్మార్గు
లచే నీమహాసభలో పరాభవమ్ము జెందనైతి, (అనిమహాక్రోధముతో
క్రిందనున్న చక్రమ్ముచేనంది) ఇక్కురుకులమ్ము నెల్లనొక్కమాటుగా
నాచక్రమున కుపాహార మొనర్చెద. (అనిచక్రమును విడువబోవుననంత)
భీష్మ:— వ॥ రమావరా, వందనము.

ఉ॥ మామకుమాగులయ్య పరి । మార్పగ నెంచగ మేలటయ్య మీ
మామను జూడుమయ్య కుల । మాన్యత నెంతయు నిల్పుమయ్య నీ
నీమము మానుమయ్య యను । నేతవు నీకెవ రెవ్వరయ్య నీ
ప్రేమను నింపి కౌరవుల । బిడ్డలు గాగనుమయ్య మొక్కెదన్॥

కృ:— వ॥ కురుకులాధిపా నేఁటకే తేరినది మొదలింతవరకీదుర్మదాం
ధుల ప్రలాపమ్ములెల్ల న్వినియున్నిటుల వారింపనగునే.
అయినను వృద్ధుడవని నివచనమ్ములు విశ్వసించినను నక్కి
రాతకులింకను వారివారిదురాగతమ్ముల నతిశయింపన్ జే
యక విడుతురా.

10 వది కీర్తన (భీష్మునకు గుర్యోధనునకును హైలాంగ.)

దుర్యో:— వ॥ కృష్ణా నేనేజగదాధారుండననియు నసమానశూరత్వ
మున నలరారుదు ననియు నర్జించెదువారు ముల్లోక
మ్ములన్ లేరనియు బడాయిగొట్టుటన్ దక్కనిపరాక్ర
మమ్మునకు

గీ॥ అంతచుట్టములైన యా । కుంతిపుత్రు
లన్నదమ్ములు ఖన్నులై । యడవులకును
పోవువేళను నీవుదా । పునవెయుండి
యేమిజేసితో యెరిగింపు । మీయొకింత

వ॥ కాన నీగుణంబెరుగనివారు నీస్తుతికి బాల్పడుదురే కాని మాజోట్లు లియ్యకొందురే. అయిన నీయాదవ పరాక్రమమ్ములును నీగంతులును నీదేవతయగు గంగగొలుపున బ్రకాశించునేగాని యసమానశూరత్వమున లోకంబెల్ల నేకచ్ఛత్రాధిపత్యమ్మున పరిపాలించు మావంటి సుక్షత్రియోత్తములకడ నుపకరించునా, చాలుచాలు.

కృ:— వ॥ ఓరీకౌరవాధమా,

మ॥ కనరా నాదు పరాక్రమమ్ము రణరం గంబందునో ఓరీ మేల్
కొనరా యిప్పటికైన బ్రొక్కులిడి నీ కర్ణగల్గు బాంధాళితో
మనరా యెప్పటికైన నేగికడుసన్ మానమ్ముగా లేనిచో
వినరా బంపెద గాలు పత్త్రమునముల్ వీక్షింపగన్ దుర్మతీ॥

గ:— ఓరీమాధవా, సంగీతమ్మునకు చింతకాయలు రాలునా యను సామ్యమ్ముగా నీదబ్బరకూతలకు మేము జంకుదుమా! ఔనునీవలన గొట్టబడినవారే పాతాళపురంబెల్ల నిండి బలికి బరువుగా గోచిరట.

కృ:— వ॥ మూర్ఖా, రోల యిట్టి వాగ్వాదములు

ఉ॥ కొట్టిన నేనకొట్టవలె కోరికనీవు సహాయులన్ నిన్
బట్టిన నేనెపట్టవలె బట్టుదొలంగికి హస్తినాపురిన్
గట్టిన నేనెగట్టవలె గట్టిగపట్టము పాండుసూతికిన్
గట్టిగ చెల్పుమా బ్రతుకు కాంక్షనువీడిన నీభటాళికిన్॥

దు:— వ॥ కర్ణ,దుశ్శాసన, శకుని,కృపాశ్వత్థామ, ద్రోణభీష్మ కురుకుల యోధులారా, యీయాదవకులజుండు పలుకు వచనమ్ములకింకను యూరకుండుట యుక్తంబు, వాడొక్కరుండై యిందర నధిక్షేపించుచు మీమీబలమ్ములన్ గూడి నాపై రణంబొనర్చుడనుమాట నెన్నియో సారులనుచూడ రాజ

కులులపై యింకను యూరకుండుట యుచితమ్ముగాదు, కాన వేవేగ మీయస్త్రశస్త్రములఁ గొనియరుదేరుడు. (అనవెల్లరు కరవాలమ్ములతో నపార్థసారధి జుట్టుముట్ట వారిమోము లుపలక్షించి)

కృ:- వ॥ దుశ్శీలులారా, రండురండు, ఓరీ దుర్యోధనా,

ఉ॥ మాతిని మీసమున్న నృప ! ముఖ్యుడ వేని సభాస్థలమ్మునఁ
కూతలు మాని నిల్చినను ! గూడిన రూపము జూచి ప్రాణముల్
చేతను బట్టుకొమ్మువిడ ! జేతువా యింటని గెల్వకున్ననో
ప్రేతమమెల్ల యుద్ధమున ! బ్రేవుల జీల్చెదనన్న నవ్వరో॥

(అని శ్రీకృష్ణుండు యీపదునెనిమిది యక్షౌహిణుల సైన్యమ్ము గూడిన యస్త్రశస్త్రధారులౌ కౌరవయోధులఁగల యక్కౌరు సభలో కడురోషావేశమ్మున విశ్వరూపుఁ ధరించ నెల్లరును మేను దొఱంగిన భాతి పృథ్వీస్థలిఁ మూర్ఛాపరవశు లగుదురు.)

విదు:- వ॥ సృష్టిస్థితిలయ పరిపాలకా, వందనము.

కృ:- వ॥ సుఖీభవ, నాయనా, విదురా, యీదుర్మదాంధులు నావిషయమ్మున జల్పిన యగౌరవప్రలాపమ్ములఁ వినుచుంటివి గదా.

విదు:- వ॥ మహాత్మా, తమవిషయమ్మున వారొనర్చిన దుష్కృతమ్మె గదా వారిని తుదకీదుర్గతి పాలొనర్చినయది. (అని యుభయులు మాట్లాడుకొనుచు పోవుటలో కృష్ణుని పల్కులు ధృతరాష్ట్రుండు విని తానును చింతతో)

ధృ:- వ॥ కృష్ణా, నీవు ధర్మరాజాదుల భాగమును గురించి తొలుతనే నన్ను దుర్యోధనునికి యివ్వమని బోధించవలసినదని చెప్పినప్పుడు, నీవునాకు నల్లుండవై యిట్టియంధునకు నేడాదికొక పరియైన దరిశన మీలేదను కోపమ్మున నీకు ప్రతికూల.

మ్మగా పాండుకుమారులకు భాగమొక్కడదని పల్కితి
గాని, వారికష్టములను నేను గనలేకనే నీయెదుట దుర్యో
ధనునకు బోధించితి గాని కర్ణపిశాచము బట్టి వేధించు
చుండ నాపల్కులెట్లు వినగలడు అయినను మాధవా.

చ॥ అనుకొన నేమిజచ్చు సమ । యమ్మున చేయిగ్రహించి పల్కెనో.
అనఘ చరిత్ర యిర్వురము । నన్నలదమ్ముల మయ్యు నేటికీ
తమవును వీడుచుంటిని గ । దా యిక నాదుకుమారులెల్ల నీ
తనయుల పోల్కిగా గనక । తప్పదటంచని యొప్పగించెనే॥

కృ:- వ॥ మామా, శాంతింపుము, శాంతింపుము. ప్రపంచమ్మున
జననంబగు ప్రతిజీవాణువును లయంబొందునని గుర్తెఱింగి
యు నద్దానిఁ దలంచివగచుటేల. అయిన నప్పాండు
ఘ్మాతలేనుండొడలు వాసిన దాది ధర్మరాజాదులే దిక్కు
లేక వర్తించుచుండ దమసంతానంబును నించుక పుణ్య
మ్మును గట్టుకొనిరి. దానవవ్వారలకష్టమ్ము లతిశయించె.

ధృత:- వ॥ నందనందనా,

చ॥ జనకుడు లేక యున్నమృదు । శయ్యల బగిలియు మద్రసోత్తభో
జనముల తృప్తిజెందు నృప । సత్తముగా మనపాండుపుత్రులా
ఘనుడు ఘటించు జూదమున । కల్మిదొలంగి యరణ్యభూములం
దున బడరాని కష్టముల । దూలుచు నుండను నీడలేదుః
ఖనిరతి నుండి రేనుబ్రబను । కగల నాకుణమైన నల్లుడా॥

వ॥ తండ్రి లేకపోయినను వారు యధావిధిని సౌఖ్యములనే
బొందుచుండిరిగాని యీదుర్మార్గుండవ్వారల కల్మికొని యరణ్యముల
పాలొనర్చ నష్టకష్టములకొడిగట్టి చెట్టునకొక్కడయ్యె ననెడివార్తచే
నామనంబెంతయో ఘోషించుచున్నయది.

కృ:— వ॥ ఆవిషయమున మీా కేగాదు లోకమున వారికష్టములఁ దలంచి కన్నులనీరిడనిమానవు డుండడు. అయిన నాయే పురిలో ధర్మరాజుకష్టముకష్టములా. ఆతండు తొల్లిటినుంచియు ననుభవించిన సౌఖ్యముల కిప్పటియిడుములఁ దలంప గుండెనీరౌనుగాని యితరంబున్న యేమన.

సీ॥ నిత్యోదయస్నాన ॥ నియతినుండెడిమేటి
కభిషేకమున గర ॥ వయ్యెనకట
భక్ష్యభోజ్యాన్నాను ॥ భవమొందునరనాథు
డాకలమ్ములదిని యడలవలెనె
అనయమ్ముమీాతల్ప ॥ మునను౦డుసుకుమారి
రాళ్ళలోబడియు పొ ॥ ర్లాడుచుండె
నినుహాసించుచు వె ॥ ల్గునట్టియిగను రేడు
కటికి చీకటినుండ ॥ గనుఘటించె

కటకటా వారికష్ట సం ॥ కలనగనిన
నెంతకఠినాత్ముడైన కా ॥ సంతనీరు
గన్[illegible] విడకున్నె వే ॥ కన్నులున్న
బ్రహ్మేంద్రుడైనను మేటిమా ॥ నీంద్రుడైన

షా॥ వారిఁ దలంచినప్పుడెల్ల కొంచెము కన్నులనీరు విడవలసినదే కాని పూర్వజన్మకర్మము నెవ్వరు మరల్పగలరు.

ధృ:— వ॥ కృష్ణా

ఉ॥ ప్రాణముతోడ నూటిభువి ॥ పాండుకుమారులు గుట్టకొక్కరై
కాననసీమలోన కసు ॥ గాయలభక్షణ జేసి ఘోరదుః
ఖానల తప్తులౌతరిని ॥ నక్కటమేలొనరింపనైతి నా -
బూనిన యీకళేబరము ॥ పోయినదాని సమానమేగదా॥

కృ:— మామా, దుఃఖింపకు దుఃఖింపకు నేను ముల్లోకముల నాయుదరమ్మున నుంచుకొనంజాలు సామర్థ్యముం గల్గిన బావమరందినైన వారల కేమిసాయంబొనర్పగల్గితి. అట్టివారల కట్టిదుర్ఘటన స్థితిలో దోడ్పడకున్నను వారు నాయందలి భక్తిచే మెలంగువారలుగాని తమసుపుత్రుల మాడ్కి గారవంబుం దూలి పెద్దచిన్నలమదినిడక కట్టివేయుటకు యత్నించువారలుగారు. దీనికంతయు గేహాదేహామదంబే కారణము.

ధృ:— వ॥ నీయెడ నింతటిదుర్మార్గ మొనర్ప యత్నించిరిగా. దుర్మదాంధులకు పోవుకాలమాసన్న మయ్యెనేమో, విదురా, యావర్తమానం బించుక వినం జేయుము.

విదు:— వ॥ అనుజా, నే నేమివివ జేయనేర్తు. ఇమ్మహానుభావుండు సుయోధనుని కడకరుదెంచ గడ్డంబు పట్టుకొని మహాదీనత్వముతో బావా ధర్మరాజాదుల భాగము సంతోషముతో వారికిచ్చివేయు మనన,

ఉ॥ తమ్ములు వారు నీకు పిన । తండ్రికుమారులు గాన దానదో
షమ్ముల వాసి జేరిక । జాలకృపోన్నతి శోడ నర్థరా
జ్యమ్ము నొసంగి మీరు తొల్లి । జాడను మైత్రిని నొప్పియుండనా
సమ్మతమాచు దెల్పి విన । జాలని యట్టి మూర్ఖులు వెసన్॥

ధృ:— వ॥ ఇంతవఱకెల్లరును సంతోషింపదగురీతినే బోధించె, నిది యస్మదాత్మున కయిష్టమైదోచెను గాబోలు. తరువాత, తరువాత.

విదు:— వ॥ తరువాత సుయోధనాదులెల్లరుం జేరి

ఉ॥ పాండవులందు జేరి సఁగ పాలుగ్రహించఁగ వచ్చువీని ను
ద్దండత బట్టికట్టుడని దారొఁని నీసుకుమారులెల్ల దో
ర్దండుని రూపుఁజూచి మది తల్లడమంది ధరాతలమ్మునన్
బండిరి తెల్విలేక తమ ప్రాప్త మికెట్టుల నుండునోఁగదా॥

(అని తెల్ప ధృతరాష్ట్రుండు చింతచే మూర్ఛిల్లును. అంత కృష్ణుండు విదురునిబంపి తానొక విజనస్థలమ్మున కర్ణునికి కొన్నినీతులు బోధించుటకై వేచియుండును.





శ్రీరఘురామచంద్రమూర్త్యైనమః.

## శ్రీ శృంగార విచిత్ర

# శ్రీకృష్ణరాయబారము.

## చతుర్థరంగము.

(కృష్ణుడును, కుంతియు ప్రవేశించుచున్నారు)

కుం:— వ॥ కృష్ణా, రాయబార శుభాశుభము లేమయ్యె?

కృ:— వ॥ అత్తా చెప్పుట కేమున్నయది. వారు నేజెప్పునది మదినిడక నన్నే హేళనకు ప్రారంభించిరి. అయినను వారెల్లరు కర్ణుని వచనప్రకారము చరించువారేగాని యుచితమైన స్వాబల మ్ములచే ప్రకాశించు నట్లగుపడరు.

కుం:— వ॥ కర్ణుడు మనలోనికి వచ్చునేమో యాతని మనమ్ము నుప లక్షించితివా?

కృ:- గీ॥ పరగ దుర్యోధనుని బహిః ప్రాణమనగ
రంజిలుచు నష్టలేని పరాక్రమమున
దిగ్గిశల కీర్తి బరపెను దినకరసుతు
డతని నెఱుగవీవు వినుడి నాయత్తగారు॥

వ॥ అయిన నదియో నాఁటో వచించినకరణి నచ్చుచునేయువాఁ
డు. యరనిమిషములో నంతయు తేటపడగలదు.

కుం:- వ॥ కృష్ణా, యీవిషయమున నీసామర్థ్యమునంతయు ధార
వోసి మనలోనికి వచ్చునట్లొనర్పవలెను సుమా.

కృ:- వ॥ అత్తా యీవిషయమున నీవంతగాఁజెప్పవలెనా! శక్తిలోప
ములేకుండ యత్నింతు, గాని యతండురా తిర్మానింపడని
యే నాతలంపు. అయినను కల్పించెద నేనతనిమనమ్మును దెలి
సికొనునంతకు నీవింకను రహస్యప్రదేశమున కరుగుము.

కర్ణు:- వ॥ బావా, వందనములు.

కృ:- వ॥ సుఖీభవ, సుఖీభవ. కర్ణా, యీయుచితాసనమ్మున విశ్ర
మింపుము.

కర్ణు:- వ॥ చిత్రముబావా తామునన్ను గుఱించినవర్తమానం బెద్ది
యో వినగోరువాఁడ.

కృ:- వ॥ కర్ణా నీకువినజేయుటకు నీవెఱుంగనిదేమున్నయది! అయిన
నీతో నొకరహస్యవచనము చెప్పఁబూనుకొన్నాడ. నీవు
దానికిసమ్మతించినచో నాపైనిజరుగంబోవు ప్రతివిషయ
మ్మునకును నీయిష్టమునే చట్టముగా గైకొని నట్లొనర్చెద.

క:-వ॥ బావా, తామువచింపఁబోవునది నాకిదివరకు తెలిసినవిషయమే.
అయినను తిరిగివచించినయెడల వినిహ్యా పదలంచెద.

కృ:— వ॥ నీవునామాట ప్రకారము పోదువని వాగ్దానము జేసినపైన గదా వచింతును.

కృ:— వ॥ అదెద్దియో వినినపైఁ జెప్పవలసినది యేగాని మున్ముందు వాగ్దాన మొసర్చుటెట్లు బావా.

కృ:— వ॥ కర్ణా, అటులైన వినుము.

ఉ॥ భాసురగాత్రి కుంతి తన బాల్యమునందున ప్రీతితోడ దు
ర్వాసమహామునీంద్రునకు భక్తిజెలంగ నమస్కరించి నే
జేసిన పాపముల్ దునిమి సేవకురాలికి భాస్కరాకృతిఁ
భాసిలు పుత్రకుండొదవు పావనమంత్రము జెప్పుమంచనన్॥

వ॥ అయ్యతినరుండు దయార్ద్రమానమ్మున "బిడ్డా, చిరుతప్రాయమ్మున వర్తించు నీవునాయందు జూపినభక్తి శ్రద్ధలకు నామనం బానందమ్మున మునింగె. గాననీయాప్సితరీతినే నీకట్టిమంత్రము నుపదేశించితిని. నీవద్దానిని నెప్పుడుభక్తితో స్మరింతువో యప్పుడే గర్భంబొదవి పుత్రుండు గల్గునని యాశీర్వదించి యమ్మహానుభావుండు వెడలినపైఁ గుంతితన కన్యాత్వమ్ము వెడలకపూర్వమే యద్దాని నిజానిజమ్ములఁ గనుంగొననెంచి గంగాజలమ్ముల కృతస్నాతయై మనోనిశ్చయమ్మున ప్రభాకరునకభిముఖమ్ముగా నిలిచి యామంత్రమును పఠించినంత నయ్యామెకు సద్యస్కాలగర్భం బొదవి,

చ॥ కనినను భీతిచే పరుని గామదినెంచియు మందసమ్మునన్
జొనిపియు గంగలోవిడువ సూతకులాంగన దెచ్చి పెంచగా
ఘనముగు రాధ పుత్రుడన గాథలి చొప్పితివంతెగాని నీ
జననియె కుంతిదేవి యిది సత్యమటంచని మొంచుకర్ణుడా॥

కర్ణ:— వ॥ బావా యిదియెల్లయు నే నెఱింగినవిషయమే. అందులకు తామిప్పుడేమి వచింతురు.

కృ:— వ॥ కర్ణా, ఆమె యిప్పటి కష్టానుభవమును యనుభవించుచున్నను పతివ్రతాధర్మిణియైనదాని నిన్ను గురించి యనుభవించు దుఃఖమ్మును వచింపనేరకున్నది. నేనామె నిప్పుడు దర్శించుటకు విచ్చేసినను.

ఉ॥ కోరియు మూడులోకముల గీర్తి వహించిన యట్టి సుందరా
కారుడు మేరుధీరుడన గాదగు నాసుకుమారు బాసి యే
తీరు భరించి గాంతునని తెల్వని దప్పి ధరిత్రి వ్రాలి తా
ఘోరున చింతగుందు పరి పూర్ణకృపామతి కర్ణభూపతీ॥

వ॥ గావ నట్టి తల్లినింకను చింతల జేయక నామాటల విశ్వసించి

గీ॥ పంచపాండవులకు ధర్మ పత్ని గాక
బరగు పాంచాలియందునీ భాగమరయు
నట్లు నొప్పింతు వినుమునీ యంతరంగ
సందియము వీడి రమ్ము నా నందముగను॥

కర్ణు:— వ॥ రమాపరా, నీవట్టి సమర్థుండవే కాని దుర్మార్గుండైనను యానుయోధనుండు తొల్లిటి నుండి నావిషయమ్మున జూపుచుండెడి భక్తి శ్రద్ధల నేనభివర్ణింపనశక్తుండ. నిదియు మాతల్లిగారి పరిపూర్ణాశీర్వచనమ్మైయ్యే యుండవచ్చును. లేకున్న నాజన్మకట్టి గారవంబు జరుగనుండునా.

కృ:— వ॥ కర్ణా, యేరీతి జరుగుచుండెనేమి అయినను నీవదృష్టశాలివుండవు. నీవెక్కడనున్నను యీవిధి నేజరుగగం బోలు. నని నాతలంపు. అయిన నాయిూర్ష్యాదు నీవిషయమున నెట్లు మెలంగుచుండెనో విన వలతువించుక విన్నజేయుము

కర్ణు:— వ॥ బావా,

ఉ॥ చిన్నతనమునుండి యితడు చెప్పదు నాదగునాజ్ఞ నెంతో గా
గన్నుల నద్దుకొంచు గురి గారవమందు ధరించు నీకనే

దిన్నది తిన్నమంచు తను ఽ దిన్న దినమ్మున్న గనెంచు వానినో
చిన్నతురంగి పీడినను ఽ ఛీయనరే నగరే జనమ్ములౌరా॥

వ॥ నందనస్వాతనా యాగకను,

ఉ॥ ఉన్నదివానిమీడ దినము ఽ చున్నది యాతనిభోజనమ్ము పై
నున్నది వానిచేల పడి ఽ యున్నది యాతనిమంచమింటనే
మున్నదదెల్ల వానిదగ ఽ నుప్పనదేభళి! యట్టివానినో
చిన్నమరందపీడినను ఽ ఛీయనరే నగరే జనమ్ములౌరా॥

వ॥ బావా మరియును,

ఉ॥ రాజపదమ్ములేక సరి ఽ రాజులు గారవమీయదంచు రా
రాజగు తాను నంగమహీ ఽ రాజుగ నన్నవరించి భోగవి
భ్రాజితుగాక జేసి భువి ఽ రాజులచేస్తుతియింపచేసె తే
జ్పూజితు పీడజాలు పరి ఽ పూర్ణకృపామతి నాదరింపవే।

కృ:— వ॥ కర్ణా అదియు వాస్తవమేగాని అదిగో మీతల్లికూడ నిట్టు
కరుదెంచుచున్నయది ఆమెతోగూడ యించుకసంభా
షించి యయ్యామెగారి భోపశమన మొనర్చి వెడలుదము.

కర్ణు:— వ॥ తల్లీ వందనములు

కుం:— వ॥ ఐశ్వర్యప్రాప్తిరస్తు.

కర్ణు:— వ॥ అమ్మా, యిందేల కొంకిరిగా చరించుచు దుఃఖింతువు.

కుం:— వ॥ నాయనా, యెన్నడో నను బాసిపోయిన నీముఖారవిందము
వీక్షించినంతనే భరింపజాలని చింతాసముద్రమున
మునుగనయ్యె, నాయట్టి దురదృష్టురాలికి నీయట్టిసత్కు
మారుండేలదక్కు అయినను నీకు జన్మవృత్తాంతము చెప్పెదను నంత
యాలకించి నన్నాదరింపుము.

ఉ॥ కంటికుమారనిన్ను, కుతుకమ్మున నేవురకెల్లముందు నీ
వంటికుమారుమండ భువి ఽ వాంఛలు దీరుట చోద్యమౌ నా నీ

కంటుతనమ్ము వీడి కృపఁ గాంచక జూడుము దమ్ములెల్ల నీ
వంటె శిరమ్మునందు భవఁ దాల్చి ధరించెడు వారు పుత్రకా॥

వ॥ హా! కుమారరత్నమా నేనీయెడ నొనరించిన దుర్మార్గమునకు

ఉ॥ కోపము బూనకన్న ననుఁ గూడిన తప్పు క్షమింపుమన్న నీ
వేపని జెప్పినన్ విడకఁ యెంతయు తమ్ములు జేతురన్న యా
పాపిని వీడుమన్న భువిఁ బాలననీకగునన్న కృష్ణుడే
ప్రాపగు నన్న నీవు సుఖఁ పంజర మెక్కెదవన్న నమ్ముమీ॥

కర్ణు:— వ॥ ఆహా, యెంతకాలమునకు నామాతృదైవమును కనులార దర్శించినోటార భాషించుభాగ్యంబాదవె (అనుచుకొంత వడి విచారనిమగ్నమానసమ్మున ధరిత్రిపై కూర్చుండ కుంతియు పెక్కుచింతతో)

కుం:— వ॥ హా నాయనుంగు పుత్రా!

ఉ॥ హా సుకుమార, మారసమఁ హా గుణరత్నమ హా నిదానయా
హా సుజనైకపూజితదఁ యామయ నేనిటు వంతగుందుచున్
గాసిలి ప్రాణముల్ నిలుపఁ గాగల నాకలనైఁ గాంచుమో
హా సుతుడా కృపామతినిఁ మెప్పుగ తల్లిని బాసియుందుదే॥

వ॥ పుత్రా నీచందంబున్ గాంచనా డెందంబు బ్రద్దలగుచున్నయది. నాయనా, శాంతించి లేచికూర్చుండుము. (అని లేవనెత్తును.)

కర్ణు:— వ॥ హా జననీ పుట్టుకలోనే నాగుణాబెటుకర్షించి యంతనిర్దయ బూనన సమకట్టితివే తల్లీ కల్పకవల్లీ

గీ॥ కన్నకష్టమునైన నిఁక్కముగదీర్ప
జూడదని గాదె కన్నారఁ జూడకటుల
పుట్టగనె యబ్ధినోటిలోఁ బెట్టినావు
యెంతబరువైతినే తల్లిఁ కుంతినీకు॥

వ॥ అయిన నేనివ్విధి తిరిపెపుబిడ్డనై పెరుగ బడవలసినగీత స్పష్టముగా నానొసటలిఖించి యుండ నీవేమిచేయగలవు. తల్లి దయచేసి యిప్పుడీ చిరజీవినేమి కోరదలంతువో కోరుము.

కుం:— వ॥ నాయనా నా తెలిసి తెలియక నొనర్చిన తప్పుక్షమింపుమని తొలుదొల్తనే నీకడవిజ్ఞప్తి జేసికొనియుంటినిగదా. దానిని మదినిడక నాకడనిలిచి తమ్ములఁ గూడినన్ను పోషింపుము.

కర్ణ:— వ॥ అమ్మా, నీవుకోరినగీతి నెటుచరింపనేర్తు నీవట్టినిర్దయబూనినను నీయాశీర్వచనమ్మున నేనిప్పటికైన నేదేయొకనృపునాశ్రయించి తనుపోషణనొనర్చుకొనుచుంటి. దీనికి నే నెటుల సంతసించున్నానో నీవటులనే సంతసింపఁ జెల్లుగాని యిటులాడనగునే. అయినను,

ఉ॥ నాయదె యిల్లు వాకిలియు ! నాయదెరాజ్యము నాదెభోగముల్
నాయదె సర్వసైన్యమును ! నాయదె పాలననాదె మాటగా
జేయని గోసజేతికిడి ! జెప్పినరీతిగ బోవువాని ద
న్యాయమొ న్యాయమో విడువనంబరొ పల్కులు పెక్కులేటికిఁ॥

వ॥ తల్లీయింకను,

ఉ॥ అట్టులతాను మస్తకము ! నంగాధరించు మదీయవాక్యమె
ప్పట్టున నేమి నాకెదురు ! పల్కులువల్కను బంటురీతి ను
న్నట్టి హిరణ్యగర్భముల్ విడువ ! నందరుదిట్టుటెగాక పార్థుతో
నెట్టన బోరలేక నిట ! కేగెనటంచొక దూరు జెందనో॥

వ॥ గానతల్లీ యాయాశవిడచి మరొండెద్దియైన నావలనసత్కరింపంబడి నన్ను ఋణవిముక్తుని జేయుము.

11 వది "కీర్తన" డైలాగ్,

కర్ణ:— వ॥ తల్లి, అదో నాకైకొందరుభటులు వచ్చునట్లగుపడెడిగాన శలవొసంగుము.

(అని నిష్క్రమింతురు.)



శ్రీరఘురామచంద్రమూర్త్యైనమః.

శ్రీ శృంగార విచిత్ర

# శ్రీకృష్ణరాయ భారము



## పంచమరంగము.

—*ధర్మరాజు కోర్టు*—

(ధర్మరాజు, భీమార్జున, నకుల, సహదేవాభిమన్య ద్రుపదపుత్రీసమేతముగా ప్రవేశించును.)

ధ:— వ॥ సోదరులారా (అని తలవొంచుకొని కన్నుల నీరు రాల్చుచుండును.)

భీ:— వ॥ పార్థా, మనయగ్రజుడు సోదరులారా యనిపిలచి చింతచే గృశించెడు కారణాంబేమైయుండును. మీారేమయిన నీమన కష్టములన్నియు ధర్మరాజువలననే రాబడెనని దూషించితిరా యేమి?

అర్జు:— వ॥ వాయునందనా మనకిన్మహానుభావుండన్నగానే వర్తించె
నా అట్టిమహాత్ముని ఋణమ్ము బ్రదుకువరకు దీర్చినను
దీరనేర్చునే.

ఉ॥ పెంచెను తండ్రిపోల్కి మురి - పెమ్మున పిన్నటనుండి విద్యజె
ప్పించెను నన్ను వస్త్రముల - బీదల జేయకగోరురీతి న
ర్పించెను నెల్లలోకముల - వేడ్కను ధర్మజుడంచు కీర్తిసా
ధించిన యట్టియన్న నిల - దిట్టగ నోరెటు లాడుసోదరా॥

భీము:— వ॥ నకులా నీవేమైన యంటివా

నకు:— వ॥ ఎంత దుఃఖమెంత దుఃఖము.

గీ॥ అన్నయా యాఘనుడు మనకె - గన్నతండ్రి
నైన మరపింప గల్గిన - యట్టిరీతి
జూచి వృద్ధికి తెచ్చిన - సుగుణశాలి
అట్టి మహనీయు దూషింతు - నా పవనజా॥

భీము:— వ॥ సహదేవా నీవేమయిన దూషించితివా.

సహ:— గీ॥ ధరణి గురునాథు మాయజూ - దమునదక్క
నగ్రజుడు జయమందని - యాటలున్నె
యట్టి దైవస్వరూపుని - నెట్టిదూర
మానసం బొప్పనేటికా - మాటలన్నా॥

భీము:— అభిమన్యు ద్రౌపదతనయ లేమయిన దూషించిరేమో కనుంగొని
యెదగాక (అనిపారలుభయులను దగ్గఱకు బిలుచుకొని)

(12వది కీర్తన కైలాగ్)

వ॥ ఇందున నయిన గావలె లేకున్న దుర్యోధనుడు భాగం
బిడకున్నను ప్రాణములోనైన బోనిచ్చునో లేదో యను సందేహము
చేతనైన గావలె గాక మరేముండును. అయిన ఆయనను గుర్తెరిం
గెద. అగ్రజా నీకిట్టిచింతబొడమ బనేమి.

గీ॥ జనకుడీల్గిన మమ్మెల్ల । జనకుపోల్కి
విద్దెబుద్ధుల జెప్పించి । వృద్ధిజేసి
చింతజెందెద వేలనో । జెప్పకున్న
బ్రాణముల గదకర్పింప । బూనుకొనెద.

(అనిదుఃఖముచే క్రిందనుండినగదను చేనందునంత ధర్మజుడులేచి పట్టుకొనును.)

ధర్మ:— వ॥ తమ్ములారా,

గీ॥ ఈమువారలు రాష్ట్రమ్ము । లేలుచుండ
మిమ్ము నిట్టులమాయజూ । దమ్మునాడి
కూటికిని కరువుజేసిన । కూళునకిక
చింతగాకున్న నెటుగూడు । సంతసమ్ము॥

వ॥ నాయనుగుంగు సోదరులారా నేనట్టిజూదమ్మున సర్వమ్మున్ గోల్పడి మీకష్టకష్టమ్ముల సంప్రాప్తింప జేసినను నాయందేటి యాగ్రహమ్మున్ జెందక తొల్లిటికంటె వేయిరెట్లెక్కుడు విధేయతతో వర్తించు మీసుగుణసంపత్తికి నన్నిసౌఖ్యమ్ముల జగద్విఖ్యాతమ్ముగా ననుభవించవలసిన ప్రాయమ్ములో అన్నిటికిని వెలిజేసి యికను యీమీకష్టచయాదులనెల్ల గాంచుటకు సజీవత్వముననుండు నాకింక్కెడి సంతసము,

ఉ॥ ధారుణి నన్నలన్నతమ । తమ్ములనెంతయు వృద్ధిజేసి వి
స్తారధనమ్ము రాష్ట్రముల । జాలగణింతు రికేమి సర్వమున్
ధారుణి పాలుజేసి యిక । తమ్ములకెంతయొ దీనవృత్తిచే
కూరగజేయు నన్నయిల । గూలుటె యుండుట కన్నమేలగున్ ॥

వ॥ ఇట్టి దైన్యముచే కూర్చినను అంతటితో విడక రాయబార మునకై కుసుమవిగుండ బుత్తెంచితి. అసంఖ్యాకములగు బలంబుల గూడి యుండు ధృతరాష్ట్రనందనుడు మనభాగంబిడుట కియ్యకొండై

భీము:— కీర్తన (ధర్మరాజునకు డైలాగ్.)

వ॥ అగ్రజా ఇదివరకెన్నండైన నొక్కయరనిమిసమేని మిము బాసియెఱుంగుదుమే. వయసున పెద్దవారమేగాని మాకేమి తెలియును.

గీ॥ అన్న మీచాటునందుండి యన్ని పనుల
జేయ మీయాజ్ఞగైకొన చేతులొగ్గు
వారమే గాని మిము శాయు వారమా సు
ధీర సత్యపరిచారకుం తీ కుమారా॥

(అని పెక్కుగతుల చింతిలు భీమపలుకులకు ధర్మజుఁడుజాలి జెంది సోదరులనెల్ల దగ్గరకు పిలుచుకొని)

ధర్మ:— వ॥ తమ్ములారా యింతలో మనము రాజ్యభారము గైకొం దుమా, రాజ్యములేకున్నను వారిచేతిలో బ్రతికినదియె రాజ్యముకంటె వేయిరెట్లెక్కుడు.

భీము:— వ॥ అగ్రజా, ఎంతమాత్ర మధైర్యపడకుము. తమదయయే యున్న వారిలజయించుటవనెంత యిదిలో చిన్ని విన్నపము.

మ॥ నరనాథూత్తము లెల్ల సయ్యనగన న్నా కౌరవశ్రేశిరిః
కరపాదమ్ముల నంటగట్టి యిటుసం గ్రామమ్ములో వారివా
శిరముల్ దెచ్చి సమస్తభూజనులు నిం స్సీయించు జూడంగ ని
పురద్వారమ్ము నలంకరించు తమకిం పుణ్యాత్మనే మీదియర్॥

వ॥ అగ్రజా వారెందరున్నను మరెందరి సాయంబాదినను రణ రంగంబున మనసేవురబరిమార్చ గల్గుదుసి మాత్రమూహింపకుము. ఈనీతమ్ముండు వారిశిరమ్ములనెల్ల నొక్కమాటుగా దునిమి యవ్వా టిచే పురద్వారంబలంకరింపడో (అనునంతలో శ్రీకృష్ణుండు బ్రవే శించును.)

ధర్మ:— వ॥ బావా, వందనము. నీవడిగిన విషయమ్మున శుభాశుభ
మ్ముల గుర్తెరుగ గోరువాడ.

కృ:— వ॥ ధర్మరాజా యేమిజెప్పగు నేనట జేరి నెమ్మదిగా నెన్ని
చెప్పినను యుద్ధమొనర్పక సూది మోపినంత తలంబైన
నివ్వంబడదని తెల్పుచు నన్ను పాండవ పక్షపాతినిగా నెంచి

గీ॥ పాండవులకీతనికి మైత్రి । బహుగ గలద
టంచు ననుగట్టవేయ నెం । చించిరాగ
నంతయాగ్రహ మొదవినే । న్నఖిలవిశ్వ
రూపు జూపిన గూలిరా । రూఢిగాను॥

వ॥ ఆదుర్యోధనాదులకేను గఱపిన హితవచనములెల్ల విఫలప్రా
యములై కన్పట్టి తుదకట్టి పని జేయసమకట్టిన వారి నారీతి పరాభవించి
వచ్చితి.

భీము:— వ॥ బావా వారికి కాలంబాసన్నంబైనటు దోచెడిని.

కృ:— వ। ఔనౌను వారికట్టి దుష్టాలోచనమే ప్రాప్తించకున్న నన్నట్లు
లేల చిన్నబుత్తురు. అయిన నేనది రాయబార సమయము
గాన యూరకను నంతమాత్రముతో వచ్చితినిగాని యుద్ధరంగమే
యయినచో నెల్లరి కొక్కసారిగా కాలపురమ్మున కనిపియే
యుందు.

భీము:— వ॥ బావా అట్టియుక్తసమయమున నెట్టి చిన్న పని జేసితివి.

కృ:— వ॥ యేమది?

భీము:— ఏమియా,

ఉ॥ అట్టుల వారినెల్ల ముద । మారగ మూర్ఛల జేసి నప్పుడే
గుట్టుగ నాకు జెప్పినను గొబ్బున జేరి శవమ్ము లన్నిటిన్
గట్టలు గట్టి వారిధికి । గట్టక నుందునె యానకట్టయ
ప్పట్టున నూరివారలకు । బట్టిన పిశాచముల్ విడన్॥

కృప:— వ॥ ఔనౌను భీమా, నేనేపొరబడితి నీవాడినరీతినే యొన ర్చిన నిప్పటికి జిక్కుదీసినట్లుయుండు అయిన నిపుడు మాత్రమేమాయె.

భీము:- వ॥ బావా నాకు ఫలహారాపేక్షయైన కొంచెముండవచ్చునా

కృ:— వ॥ నీకు ఫలాహారప్రాప్తియే లేకున్న వానికట్టి గుణమేల జనించు.

భీము:— వ॥ అయితే మాతాతగారికిని గురువుగారికిని పరాయాందమైన కొంచెము దయయుండునట్లు గాన్పించెనా.

కృ:— వ॥ పాపము వారిద్దరును, కృపాచార్యులును మీవిషయమున చాలవఱకు నాకర్మదాయునకు బోధించిరిగాని వారెల్లరికి కాలముసమీపించుమయింత నెవ్వరువినెదరు.

భీము:— వ॥ వారుముగ్గురు వానికెట్టిది బోధించిరి.

కృ:— వ। మీగురువుగారు మీవిషయమున నాదుర్యోధనునితో తన మాటవినుమని (ఒక్కటే పాపకరు పద్యమును) కృష్ణుండు జదువును.

మీతాతగారు పెక్కుగితుల బోధించుచు (సమ్మానింతునో అనుపద్యమును కృష్ణుడు జదువును) కృపాచార్యులు పలుతెరగుల గరపుచు (రాజరాజవె, చూపుము నీప్రతాపము అను రెండు పద్యములను కృష్ణుడు జదువును)

భీము:— వ॥ అట్లులైన వారు ముగ్గురు మనపక్షమున బూర్తిగా నిలచినట్లు లేకున్న వారితో మనబలముల నేలనెల్లడింతురు మీవిషయమున నశ్వత్థామయును కెట్టిది బోధించిరి.

కృ:—వ॥ నావిషయమున ఓరీదుర్యోధనా యనిపలచి (భీష్ముడు జదివిన నందకుమారుడైన సహాయజూదమ్మునందు అను రెండుపద్యములను కృష్ణుడు జదువును)

తండ్రిని, భీష్ముని, కృపుని, కర్ణుడు దూషించెనని యశ్వత్థా మకోపోన్నతుండై (జదివిన నిలునిలు, అడ్డము లెండిలెండి బ్రాహ్మణుండని అనుమూడు పద్యములను కృష్ణుడుజదువును)

భీమ:— వ॥ వహ్వా! కౌరవులగుండెలు తల్లడిల్లియే యుండును. ఎన్ని శరమ్ములైన నీభావశరమ్ముల కీడగునే. బలే! ర్మచింతజేయు మమ్మిట్టి కష్టములముంచెనని గాబోలు వీరలకింత శ్రద్ధ బొడమె అయితే దుర్యోధనుని మానసంబిప్పటిచే నెట్లు వర్తించి నట్లగుపడె.

కృ:— వ॥ ఆతడు గొలువోలుత నించుక కోపించెను గాని మీాతమ్మునిచే విరాటపురిలో గల్గిన పరాభవమ్ముచే జనించిన యధైర్యమీాత మట్టునకాతని బాయకున్నయది అందుననే సమరంబొనర్పవలెనను యుద్దేశమే చాలామట్టునకు వారి యాదునగల యోధులకంటే మిమ్మే యతిశయమ్ముగా భావించి వారినెల్ల విశేషముగా పరాభవించె.

భీమ:— బావా యిదివరకు వచించినదంతయు కల్లమైనను యిదినిశ్చయమై యేయుండును. నీవుచెప్పినదెల్ల మమ్ములకొంత కాలమైన దిగులుబాపి యుంతమను నుద్దేశముచే నని యిప్పుడుగదా. మదికందినయది ఆకుస్మాగ్గునకే యిట్టి యధైర్యమొదవిననిక సమరంబే మున్నది. అయినను ప్రాప్తమున కెక్కువేముండును. కాని యాతండాడి నదియు నించుక వెల్లడింపుము.

కృ:— వ॥ ఎట్లాడెనా? కర్ణ, దుశ్శాసనాదులీతనిక జేరిరికీ వెగపేల నా యేవురెందరిని దునుమాడెదరని యింతదిగులొందెదవు మామా పరాక్రమముల దలంచియైన నీకైనీవే ధైర్యం

బవలంభింపవచ్చునే. తమయాజ్ఞయైన భూమ్యాకాశములు కరతాళములు వాయించవూ! (యన దుర్యోధనుండుగ్గ్రిం డైజదివిన ఎక్కడబోయె ఎందరమున్ననేమి. అను రెండు పద్యములను కృష్ణుడుజదువును) ఇంతమంది దిగులొందిన వానిని కర్ణుడొక్కరుండు చాలామట్టునకు పోరాడి నిల్వబెట్టగా నిల్చియపుడు వారిపల్కులరీతి మెలంగదొడంగె. అయిన సమరంబొప్పినను నవ్వారల జయించుటకెంత కాలముగావలెను.

భీమ:— వ॥ బావా, కర్ణుండింత దుర్మార్గమునకు తలయొగ్గెనుగా. (మహా రోషముతో, ఓరీదుర్మదాంధా)

శా॥ అన్నా తమ్ముడ నాకునష్టపడన న్యాయంచు కేల్మోడ్పకన్
మిన్నున్ గాంచియు మాటలాడుదటర న్మిగాంతు హుంకారమున్
గన్నుల్ గప్పియు దిగ్గమంటివట రాగస్ఫూర్తితో ప్రౌఢా
చనన్ యూరొక్కన కేవొడిట్టుదట నీన్యాయుమ్యమున్ మూషరా

వ॥ ఆదుర్మార్గుండు జేరదీసి యౌవరాజ్యాభిషిక్తుం జేసెనను యహంకారమ్మునకనుగానక వర్తించుచుంటివేమొ చతుస్సముద్రముద్రితాఖండమహామండలంబునగదా యుద్ధనిపుణుండనగు నీభీమనృపలునిచేనొక్కనిముసమ్ములో పంచప్రాణమ్ములన్ గూడిననీబలాబలమ్ములెల్లన్ కడబట్టుంగలవు కాన తెలివినొవర్తింపుము. బావా, యిక నీ యభిప్రాయమేమి.

కృ:— వ॥ మీప్రస్తుత కష్టమ్ములన్ బట్టి సమరంబొనర్చుటే నా యిష్టమ్ము

ధ:— వ॥ (భీమునకు వెరచి) అయ్యదియే నాయభీష్టమ్ము.

భీమ:- వ॥ అదియే నాయభిమతమ్మును.

పార్థు:- వ॥ నాయంతరంగంబును అయ్యెడియు.

నకు:— వ॥ నాతలంపును నద్దియ.

సహ:— వ॥ నేను మీయందరితో నేకీభవించెద.

అభి:— వ॥ నామనంబారీతినే జరించు.

ద్రౌప:— వ॥ నాయభీప్సితము నద్దియ.

(అని యెల్లరు నిష్క్రమింతురు.)



# ఈనాటకమునందలి కీర్తనలు.

1వ కీర్తన శైలాగ్.

నటి:— ఏమినాథా నన్నేలపిలచితిరి

సూ:— ఈమహాసభ్యులరు మన్నింతురానిను

నటి:— నాలోపంబదియేమియో నాథా సెలవిడుడు

సూ:— బాలా శ్రీకృష్ణరాయశారము మరచితో

నటి:— వందనములు వటపల్లివాసుడా హరిసాక్షినురచితి

సూ:— సుందరీ రామలింగేశ్వర సుహృద్వాద్యుభజించుమా॥

2 వది హిందూస్థాని ముఖారి—ఏకతాళము.

వినుడీ కూర్చొనుడీ గైకొనుఁ మావాదనముల్

ఘనతరశ్రీపండితాసుకవులారా చతురాకార ॥ వి ॥

భారమన కృష్ణరాయశారకథాసారమెల్ల ॥ వి ॥

కొల్లబుచ్చయాఖ్యుని సేలు గోపీధవుపదసాక్షిగ ॥ వి ॥

3 వది సింహేంద్రమధ్య—ఆదితాళము.

1. అడవులలోపల ఘుమఘుమలకునుకను సుడిబడిజేరితిమో కృష్ణా
   తడవొనరించిన నెవ్వగుమమ్ముల దయజూచెదరయ్యో కృష్ణా
2. దయదప్పియు చర్చించెడిమాపెద తండ్రికుమారుడ హాహా కృష్ణా
   నయమునమా భాగమ్మిడనంచని నాడటుగాచుమ హాహా కృష్ణా
3. తండ్రిలేని యర్భకులము మముకృపదాల్పగజూడుమ హాహా కృష్ణా
   ఆడలేగు యెవ్వరమై మిముమదినందెదువారము హాహా కృష్ణా
4. అంతవారిపుత్రులమైవచ్చితి మింతగతికిగనుచూ కృష్ణా
   హాతగింతుమో యడవులమార్గముబట్టుచుమో రాధాకృష్ణా
5. కొల్లబుచ్చయాఖ్యామనీషునకు కోరికలిడుహరి నిదికృష్ణా
   చెంగమాళధవుమ్మునొసంగుమి జాగొనరింపక హాహా కృష్ణా॥

4 వది జంఝూటీ—జుల్వా.

కృ:— చిన్నిమరదులారమీార లెన్నిదినములాయెనునా
కన్నులారగాంచి యింతకఠినమేలదలచినారో ॥ చి ॥

పాండవులు:—

ఏమిజేతుమయ్యయో-మీా ప్రేమలేక నడవులందు
బాములొంది గుందికొనప్రాణముల చెజేరినార ॥ ఏ ॥

కృ:— ఎంతచిన్నబోయెనయెమో-దంతిపురపుసౌధచయము
కుంతితనయులారమీారు-కాంతారముజేరినపై ॥ చి ॥

పాం:—చిన్నబోవుటేమి బావ-యున్నవారలెల్లయుండ
నన్నదమ్ములేవురమెగ - యడవులకేగినదిదాన ॥ ఏ ॥

కృ:— ఎందరున్ననేమి - ధర్మనందనులారా మీార
లందునవసియింపకున్న - నందుకొట్లుసత్కళల ॥ చి ॥

పాం:— తీరెగానెమాకుహాస్తి - పూరముచకును ఋణబాధము
సారసాక్షుమీాకుదెల్ప - చయ్యనసరుదెంచినార ॥ మేమి ॥

కృ:— చింతపీడుడయ్య బుద్ధ - మంతలారమాధవుడ
త్యాంతసంతసమ్ముగూర్చు - ధార్తరాష్ట్రజులకుచిమి॥

పాం:— కొలబుచ్చయాఖ్యు నేలు - గోపీధవమనుగనుచో
యెల్లరమీాకుగీతాంబుధి నేలముంచిగెదమయయో॥

5 వది శ్రీరాగము—ఏకతాళము.

కృ:— ఎందుకోయినీకింతదుర్గుణ ॥ మెం ॥
అందరికినానంత మొప్పపాండునందనులభాగమందజేయుట॥ కెం॥

దు:—మాధవానాదుర్మార్గమేదోయి ॥ మా ॥
సాధుసజ్జనులు సభ్యసంగన్యాయ జ్ఞాదమందువార్తిసాత్తుగొం
టిగాని ॥ మా ॥

కృ:— ఎన్ని జెప్పిననింతకఠిన మేర ॥ ఎ ॥
నిన్ను వారినిగన్న వారలిర్వు రన్నదమ్ములైయున్న వార్తదెలసి
॥ యో ॥

దు:— చెప్పబోకుమీ జేరియిట్లు కృష్ణా ॥ జె ॥
యొప్పు లేదనుచు తప్పుగాగొనకుమా యప్పతోడు వారికంతే
మాకునింతే ॥ మా ॥

కృ:— చేయిబట్టిన చెల్మిగాచవే ॥ చే ॥
న్యాయమిడి యన్యాయమున చిన్నాయనసుతుల బాయ
పాడిగా ॥ న్యా ॥

దు:— పట్టబోకుననబల్మి చెకృష్ణా ॥ బ ॥
పట్టుబట్టివారిబల్మిగాంచగ నిప్పట్టుననుయివ్వ బడది కేలపోపో
॥ మా ॥

కృ:— ఏమిజేతువో యేరుగూడగంను ॥ నే ॥
క్షేమబుచ్చ యూఖ్యనేమమిడెకు శ్రీరాముసాక్షినీవు రాము
[illegible] ॥ ఏ ॥

6 వది హిందూస్థాని—రూపకం.

కృ:— వినవుగదా నాపల్కులు వీనులలరగా
చనువుగదాయనినినుగన జనుదెంచితినో సుయోధనా ॥ వి ॥
వినవుగదా పాండవులగన గొనవుగదా భాగ్యమ్ముకుమనవు
గదా దెల్పిననేమనవుగదా నిజమునిక వినవుగదా య్యు
నవుగదా ననవుగదా వినువిరుమనుకొను తెలుగునజనినిను
ననుగనబాపిరి ॥ వి ॥

దు:— వినవిననీమాటలు గోపీమనోహర
ఘనమా పెత్తనమా నీగుణమూ దెలసెనుచాల్ చాల్ ॥ వి ॥
కనగలనా వారల సేవినగలనా పల్కుల నిమ్మనగలనా భాగ

ము చేకొనగలనా బంధువులుగ కనగలనా వినగలనా యన
గలనా కొనగలనా మునుపిటకనిపినమనుజుని కినిదెల్పినవినవో
భవి ॥ వి ॥

కృ:— మేలుదూలుముప్పగుభూపాలశేఖరా
చాలాబలశీలురు చిరుగోలలచే నొప్పింతురు ॥ మే ॥
ఏలవులరా రాజ్యమువారిపాలవురా యనిగోసరిబోలవురా
యైదూల్లిడమేలవురా గనరా వినగ యేలవురా పాలవురా
బోలవురా మేలవురా॥ చాలగకొల్లాబుచ్చయ్యనేలెడు శ్రీ
హరిసాక్షిగ॥

7నది జంగ్ల - ఏకతాళము.

దు:— 1 సుందరాంగిగొని పాదమున దిగులుజెందబనేమి వేగజెపుమీ
అందెవ్వరైన సీయందగ్గి కనుభయమొందజేసిర యిందువదన
బల్క— వెందుకెరయో కుందరదన వారి
నందివధింతునో సదనా జాలి
జెందకి గుందకి భీతినొందక నింపొందగనో ॥సుం॥

భా:— 2 ధారుణీధవయీ - సారసాక్షిమది - కోరినరీతి జరుపగలవా
మేరునగధీరా - సువిచారగాంధారి వరకుమారా యిదో
విన్నపమ్ము - యీనారీలలామ వాక్యమ్ము సత్
కారుణ్యమునను గైకొమ్ము - బల్
మేరమీరెనంచు మదికి దారుణమందక నికనో ॥భా॥

దు:— 3 చల్లగదెల్పు సీయుల్లమదేమో యోమొల్లసుగంధి భయ
మేలా - వినుము కల్లగాదేనయగుణశీలా - దెల్పు
మెల్లపూర్ణశశి సమఫాల - యెప్పుడు
కొల్ల బుచ్చయ్యనేలు శ్రీవల్లభసాక్షి వేవేగ ॥సుం॥

శివది కన్నడ ఏకతాళము.

అశ్వ:— పోర బ్రాహ్మణులని యెంచితివోరా - కనుగొంకుబన్ని నిలు
చోరా - కావరమణగించెదక్రూరా - మేరలేకబల్కజూచు
నీదగునోరుమూయజేసి యంతగర్భము - జీరిప్రేవులెల్ల నాదు
కంఠహారములుగ దాల్పుకున్న విప్రుడను ॥పో॥

కర్ణు:— ఏరా గనముంటివేగ నిటురారా - రాకులులని యెరుగవదేరా -
కరగింతునంచుగ న్నోరా - వేరులేకమూడులోకములగల - ధీరు
లడ్డమైననిన్ను విడకను - వారణాస్త్రమెక్కువెట్టి జీవనివార
ణమ్ము సల్పకున్నకర్ణుడ ॥ నేరా॥

అశ:— క్రొత్తా నేనెరుగనిదానీసత్త - నఱ కిదనముగోపలమొత్త
గర్గిచరించుట నీసొత్తా పొత్తువారిబల్మిగాంచి తలపోగరెత్తి
బల్కెదేమి వత్తిపట్టియు - కత్తికొక్కకండ జీల్పకున్న జగ
త్తులోన మారుపేరుగొనను ॥పో॥

కర్ణు:— వత్తివత్తిబల్కెదీవు గోట్టుమువచ్చినాడ ధప్పళింపుగిన్నను
యెత్తిచేరబట్టి జుర్రఁటంచనియెంచినావా భూసురాధమ ॥ఏ॥

అశ్వ:— అడ్డగింపకయ్యవీని గననోకగుడ్డిగవ్వయైనజేయడేమో దొడ్డ
మాటలాడజూచునెంతయుత్రొక్కిపట్టిచీల్తు చర్మమెల్లను॥పో॥

కర్ణు:— వారువీగలంచునెంచి నీవిటునోగుబారవేసికొన్న నికనా సార
సాక్షుడీవుగలిసివచ్చిన చర్పజేతు యుద్ధరంగమందున ॥ఏ॥

అశ్వ:— అండగాంచినిక్కెదేము నీమదమణచనెంత కొల్ల బుచ్చు
యాఖ్యని దండిప్రేమనేలు శ్రీవరునిపాదముల సాక్షిగాచు
కోరక్రూరా ॥పో॥

శివది శహాన ఏకతాళము.

కృప:— పాండవులజేరి రణమునసురమ్మని పదరెదవో దుర్యోధనా
చందధరునిపోల్కిని నిజనముల బాధ్యతలను నేటింతనా ॥పాం॥

:- పిండెడు కార్యములో నీవుండగ పిడుగులవలె పైదూకవూ
యుండిన దీవొక్కండ వెందరిని సుగ్గాడెదో, జరికింతువుమహా

ృ:- పరికింపగనుండిన రారండిక ప్రాణమ్ముల కాసించకరా।

శ్వ:- పరెయీపట్టి కుడావులకిందున వడకుదురంచుదలంతువో॥ పాం॥

ృ:- మాటను నెదుర్కాడిన మిమ్మెల్లర మాటెదనా పాతాళములో

ర్జు:- మాటుటకునుఘుండె నిశిరమ్ముగోట మీటెద ఖడ్గజాలింపు
మహాహా ॥పిం॥

ృ:- మీటెడు పురుషుడవైన నిల్తురమ్మా గనుగొందును నీబల్మిన్

శ్వ:- కూటికిజేరిన కూతలకేమిలే గోపీధవమన్నింపుమా ॥పాం॥

ర్జు:- చింతునురము ప్రేవులనామెడ ధరియింతును గాంచుమిదో విప్రా

శ్వ:- అంతకన్న నింకెంతపుట్టి శ్రీకాంతుసైరింగు నీగతియున్ ॥పాం॥

భీష్మ:- ఏలవాదములు బుచ్చయాఖ్యునకు మేలుగూర్చు గోపాలునితో

ద్రోణు:- కాలకర్మములు యేకమైన నేకరణి యూరకుండుటగల్గున్ ॥పా॥

## 10వది ఫీల్ ఆది.

భీ:- వలదువలదు వైరమూ శ్రీవరునితో రాజన్యులారా.
దలచిన హస్తిపురినిన్ పాతాళమునకున్ ద్రొక్కకున్నె ॥వ॥

దు:- తాత యతడెవ్వారుడా పాతాళమున కింపంగ భువిలో
చేతగాని పల్కులిట్టుల జెప్పకు చాల్ చాలునయ్యా ॥తా॥

భీ:- పుట్టుచావు వొక్కచేత బట్టినట్టి జెట్టియతడు
కట్టడిగ నెల్లరికి విధితా గల్పించెనో మరణామొక్కడనే ॥వ॥

దు:- మరణములేకుండ భువిలో మనుదుమె కృష్ణునిబూజింపన్
ధరరుణమ్ము దీరినపై చావతయైన నుంచగలడే ॥తా॥

భీ:- ఎందుకింత పాండురాజనందనుల భాగమ్ముయిడిన్
నందనందనునిగూడియు నా నంద మొందవచ్చునయ్యా ॥వ॥

దు:- వచ్చు, వారినెల్లదునిమి వసుధగొనిన సౌఖ్యములలో
గృచ్చిరో వారేమనెల్ల గొందుమునుస్వర్గ సౌఖ్యముల్ ॥తా॥

భీము:— కొల్లబుచ్చయాఖ్యనేలు గోపాలకృష్ణునవిరించర
మొల్లశ్రమలుచేకూరు యీవెరగవు కురువంశతిలకా ॥ త ॥

11 వది హిందూస్థాని ముఖారి—ఆది.

కుం:— తనయాసత్కృప గనవాతమ్ములచే కొనవానేజే
సిననెపములు మనమునగణుతించక ॥ త ॥

కర్ణు:— జననిరోము న్నా వినుపించితిగదె తనయునిసత్కృప
గను నమ్మినయతనిని విడువ ననినే ॥ జ ॥

కుం:— తల్లినోనాపయి దయదప్పిదవా చల్లగతమ్ముల
నెల్లయుల్లమలరబ్రోచు తెల్లగావలేనీవల్ల ॥ త ॥

కర్ణు:— ఎల్లరినిగాచెద నేనిక పార్థుని తల్లిరోవిడనశ్రీ
కొల్లబుచ్చయ్యనేలు శ్రీగోపాలబాలుసాక్షిగ ॥జ॥

12 వది జంగ్ల—ఏకతాళము.

భీము:—ఇంతీసద్గుణముల దొంతీయలచంద్రుదూల్చు కాంతిచా మంతిపూ
లబంతీ కౌంతేయాగ్రజునిసీవు కల్కిరోవినుమెపుడయినను వం
తలన్నినీవలన నెవచ్చెనంచు వచియించితో ॥ ఇం ॥

ద్రౌ:—వినుడీప్రాణేశ కృపగనుడిని జేశ గైకొనుడినామనవిచిత్ప్రికాశ
అనయుముమనలను సత్కృపనం దెడుధర్మజు నెవ్విధి ననగలవ
రులనగను నేవినగలనోవాయుతనయ ॥ వి ॥

భీము:—ఏరారిణరంగవిజిగ శూరాయభిమన్యుసుకుమారా వరమేర
ధీరరా రా అరియ కెపుడయినదుఃఖకు లాడితోమీపెదనాయ
నగారిని దెల్పుమిసుగుణవిచారజేరరారవేగ ॥ మేర ॥

అభి:— అన్న నే నెవ్విధిపెదనాన్న కౌంతేయాగ్రజ నెన్న మనసొప్పనేర్చు
నన్నకన్న వారినెల్లసమముగాగాంచెదు ధర్మాత్ముని పన్నుగ
కొల్లాబుచ్చయపాలిటిహారిసాక్షిగా ॥ యన్నా ॥

మంగళం.